# చదువుతారా? చావుతారా??

"(A) మా హరీ ఉదయాన్నే నాలుగ్గంటలకి నిద్ర లేవాలి. మనసు ప్రశాంతంగా వుండడానికి అరగంట ధ్యానం.

(B) తర్వాత కాలకృత్యాలు తీర్చుకుని, యూనిఫాం వేసుకుని రడీ అయిపోతాడు. 5 గంటలకంతా Maths, Physics, Chemistry చెప్పే ట్యూషన్ మాస్టారు వస్తాడు. 7 వరకూ ఆయన పాఠాలు చెప్తాడు. తర్వాత ఎనిమిదిన్నరకంతా మరోసారి రివిజన్ చేసుకుని కప్పు నానబెట్టిన బఠానీలూ, ఒక గ్లాసుడు పాలూ... స్కూలుకెళ్ళిపోతాడు.

(C) 12-45కి మధ్యాహ్నం భోజనం. డ్రైవర్ తీసి కెళ్తాడు. రోకటితో దంచిన దంపుడు బియ్యం భోజనం-అదీ 150 గ్రాములు. మరోవంద గ్రాముల దాకా పచ్చి కూరగాయలు. గుడ్డుగానీ, మటన్‌గానీ నై. పిల్లవాడు sharp గా వుండడానికి వుడకబెట్టిన వంటలేవీ లేవు - అంతా పచ్చికూరగాయలే!

(D) సాయంకాలం నాలుగుగంటలకల్లా స్కూల్ కెళ్ళి వాణ్ణి pick up చేసుకుని 4.30 కంతా - నల్లకుంట రామయ్య కోచింగ్ సెంటర్‌లో సీటు రావడానికి తీసుకునే కోచింగ్. 7.30కి అక్కడ అయిపోతుంది.

(E) రాత్రి ఎనిమిదికి ఇంటికి రాగానే మంచినీటి స్నానం. అర్థగంట ప్రశాంతత కోసం flute వాయించాలి. 8.30కి పచ్చికూరలతో దంపుడు బియ్యం భోజనం.

(F) రాత్రి పదకొండు దాకా మళ్లీ subjects మీద పడడం. సీఎంకు కూడా అంత tight schedule వుండదు. ఒక్కముక్కలో చెప్పాలంటే వాడికి పాస్ పోసు కోవాలన్నా తీరిక లేదు."

— నామిని సుబ్రహ్మణ్యం నాయుడు

# చదువులా?

# చావులా??

"చదువులో పస లేదుగానీ నీ కులకేం కొదవలేదు. పుస్తకం ముందు నిమిషం కూర్చోలేవు, అద్దం తీసుకుంటే మాత్రం వొళ్లే తెలవదు బిడ్డ చదివితే ముచ్చట. ఈ సోకులు చేసుకుంటే కాదు. ఆ సుజాతను చూడు, పుట్టక అంటే అదీ! ఆ పిల్ల చదివే స్కూలే కదా నువ్వూ చదివేది, ఆ పిల్లకు చెప్పే టీచర్లే కదా నీకూ చెప్పేది నీ తలకాయలో వుండేది బంకమట్టి కదా.."

-ఒక తల్లి.

"కన్ననేరానికి టెన్త్ ఫెయిలవగానే దీనికి ఎవణ్ణో వొక పంగమాలిన వెధవను చూసి తగిలించేస్తే పోతుం

-ఒక తండ్రి

"అమ్మా తల్లీ! నీ కధ నాకు తెలుసు నువ్వు వొక్క ఫార్ములా కూడా నేర్చుకోలేవు నీకు పవన్‌కళ్యాణ్ మీద వుండే శ్రద్ధ సబ్జెక్టు మీద లేదు"

-ఒక టీచరు

నామిని సుబ్రహ్మణ్యం నాయుడు

**TOMSAWYER BOOKS**
19-8-8A,
Hathiramji Colony,
Annamayya Circle,
Tirupati
Ph · 42102

# Chaduvulaa? Chaavulaa??

-Namini Subrahmanyam Naidu

*Published in :*
2002, January

*Publication :*
Tomsawyer Books
Tirupati

*Copies available :*
All Visalandhra Branches
&
All Prajasakthi Branches

*Price :* Rs. **20/-**

*Printed at :* **MUDRICA**, VIJAYAWADA.

# అంకితం



ఈ ఫోటోలో వుండే
మనిషికి ...

# గొర్రెదాటు

పచ్చికబయలు మీదపడి గొర్రెలు ఆవురావురుమని మేస్తున్నాయి నోరు తెరిస్తే చాలు నోటినిండికీ గడ్డి అంది వస్తావుంది అట్లా వుంది విస్తారంగా పచ్చిక

ఒక గొర్రె బావి పక్కన మేస్తా వుండిందల్లా కాలు జారి పడిపోయింది.

'మైదానంలో వుండే పచ్చికను కావాల్నొస్తే తీరిగ్గా ఎప్పుడైనా మేసుకోవచ్చు ఆ బావిలో వుండే పచ్చికను మేసేద్దాం, దానికంటే ముందు. అమ్మా, తెలివి దాని అబ్బ సొత్తు అనుకుంటా వుంది గావాల!' అని చెప్పి బీడు మీద వుండే లక్షా తొంభైయ్యారు గొర్రెలూ దబదబా బావిలోకి దూకేసి కాళ్ళిరగ్గొట్టుకున్నాయి

అట్లావుంది ఇప్పుడు, తల్లిదండ్రులు పిల్లల్ని చదివించే తీరు!

పాతకాలంలో పిల్లలు సరైన వైద్యం అందక లేతవయసులోనే చచ్చిపోయేవాళ్ళు. ఈ కొత్త కాలంలో చేతికి అంది వచ్చిన పిల్లలు, మనం కోరిన చదువుల్ని అందుకోలేక అన్యాయంగా చచ్చిపోతున్నారు.

వాళ్ళకు భగవంతుడు అంతే రాసిపెట్టాడనీ, 'ఈరోజు చస్తే రేపటికి రెండు' అనీ రౌడీయిజంతో మనం సరిపెట్టుకుంటున్నాం గానీ చచ్చి స్వర్గాన వున్న పిలకాయల్ని అక్కడికి వెళ్ళి పలకరిస్తే బైటపడుతుంది మన బండారం!

మీకు అర్జునుడి కథ తెల్సా? చెప్తా.

పద్మవ్యూహాన్ని గెలాయించి వెనక్కి రాలేక అభిమన్యుడు చచ్చిపోయినాడు గదా చెట్టంత కొడుకు పోయిన దుఃఖానికి మహావీరుడైన అర్జునుడు శక్తే వుడిగిపోయినట్టు పిడికిడు గువ్వయిపోయినాడు. చిన్న గాలికి కూడా కొట్టుకుపోయేటట్టు కంపకంప అయిపోయినాడు పాపం!

సుభద్రను ఇచ్చిన పాపానికి శ్రీకృష్ణుడు అర్జునుడిమీద దయదలచి,

"రాబావా! వొకసారి నిన్ను స్వర్గానికి తొడుకోని పోతా నీ అభిమన్యుణ్ణి నువ్వు చూసుకుందువు అక్కడికి ఆ ప్రీతి పోతుంది" అనేసి తీసికెళ్ళాడు.

అక్కడ స్వర్గంలో ధవళ వస్త్రాలు కట్టుకుని చిన్న బంగారు కుండతో వొక అశోకవృక్షానికి నీళ్ళు పోస్తున్నాడు అభిమన్యుడు.

"నాయినా! అభిమన్యా! ఇంత దయలేకపోయింది ఏమినాయినా నీకు! నువ్వు లేని ఆ పాపిష్టి భూలోకంలో నేనెట్లా వుండగలననుకున్నావురా నా కన్నా! రా పోదాం!" అని అభిమన్యుణ్ణి కావిలించుకుని బోరున ఏడ్వబోయినాడు అర్జునుడు!

అంతే! అర్జునుడి చెంప చెళ్ళుమంది.

"ఎవడ్రా నీకిక్కడ కొడుకు! చేసేదంతా చేసేసి ఇప్పుడు నంగి ఏడుపులు ఏడస్తా వొచ్చినావా? పుట్టింది మొదలుకొని చూశా - చిన్నాయన కొడుకులని లేకుండా, పెదనాయన కొడుకులని లేకుండా రాజ్యాల కోసం వో అని కొట్టుకుని చస్తా వుంటిరి పద్మవ్యూహాన్ని పన్నిస్తిరి. బలే మొగలాయి అని చెప్పి నన్నెత్తుకు పోయి దాంట్లోకి తోస్తిరి. చచ్చేటట్లు చేస్తిరి. పదపద, ఇంకొక్క మాట మాట్లాడితే ఎడంకాల్తో తంతాన్నా కొడకా!"

కథ జాగర్తగా విన్నారు కదా..

కడుపుకు కూడు తినేవాడెవడూ విజయమో వీరస్వర్గమో అని పోరాటం చెయ్యడు. అక్కడ తాతలూ తండ్రులూ యుద్ధాలు చేసి చస్తావుంటే ఇక్కడ అభిమన్యుడు కొత్త పెండ్లికూతురితో కులుకుతూ వున్నాడనుకుందాం కాసేపు. లోకం ఎగతాళి చేసి చంపదా! ఆ ఎగతాళికి వెరిచే ఎవరైనా చచ్చేది! ఇంక బలుసాకు ఎక్కడ తినేది, మిగిలిన బతుకెక్కడ బతికేది!

ఏ ఆత్మహత్యనైనా - పాలుతాగే పసిబిడ్డ సైతం వక్కకొరికినంత సేపు ఆలోచిస్తే చాలు - కారణం తెలుసుకోవచ్చు.

పత్తిరైతు ఎందుకు ఆత్మహత్య చేసుకుంటాడు? కారణం తెలుసుకోవడానికి తలబద్దలు కొట్టుకోవాలా?

మా వైపు పత్తి వెయ్యరు గానీ, నాకు తెలిసిన వొకరైతు బతకలేక నువాక్రిన్ తాగి చచ్చిపోయినాడు. మా చిత్తూరు జిల్లాలో రైతులు, నీళ్ళు పడతాయిగదాని బోర్లువేసి అప్పులై పోతా వుంటారు. అట్లా వొకాయన 30వేలు అప్పయి పోయినాడు. తీరే మార్గమే కనబళ్ళేదు. రైతుగదా ఐ.పి. పెట్టే తెలివిలేదు.

అప్పిచ్చిన వాడు చివరిమాటగా, "నువ్వెట్లా తీర్చలేవు గానీ నీ పెళ్ళాన్నన్నా ఒకపూట పంపించు." అని నడివీధిలో పట్టుకుని అన్నాడు.

అదీ అవమానం అంటే, అదీ ఎగతాళి అంటే! ఇంక ఆ రైతుకు ఏ మార్గమూ కనపళ్ళా. అంత తాగేసి వూపిరి పోగొట్టుకున్నాడు

ఇట్లాంటి చావులు ఎందుకు జరగతాయో తెలుసుకోవడంలో మనం ఆరితేరిపోయి వున్నాం.

ఇప్పుడు కొత్తగా చదువుకునే పిలకాయలు చచ్చిపోతున్నారు

పదహారేళ్ళ అమ్మాయిని తీసుకోండి. శ్రీశ్రీ చెప్పినట్టు ఎట్లా వుంటుంది? వాన కురిసినా, హరివిల్లు విరిసినా ఆ పిల్ల కోసమే అని కదా ఆమె నమ్మకం!

ఆ వయసులో, శరీరం నిండా కవిత్వం ప్రవహిస్తూ వుంటుంది

కాలేజీ టైం ఇంకా చాలా వుంటుంది అయినా నడవాలని ఉండదు. పరిగెత్తాలని వుంటుంది. అదీ Life లో Poetry అంటే,

పరిగెత్తడంలో ఎదురుగా చిన్నరాయి తగిలి కాలివేలు చిట్లుతుంది. అయినా నెప్పి అనిపించదు.

దారిలో క్లాస్‌మేట్ వొకడు కనిపిస్తాడు. వాడు ఈమెకోసం వెనక్కి తిరిగి చూడడసలు. చూడకనే వుంటాడా అని ఈ వగలాడి వెనక్కి తిరిగి తిరిగి చూస్తుంది నవ్వుతూ!

బస్సెక్కుతుంది ఎక్కడో డ్రైవర్ సడెన్ బ్రేక్ వేస్తాడు. ఈ కాలేజీపిల్ల తూలి పడడం మానేసి బస్సంతా వినపడేటట్టు పకాపకా నవ్వుతుంది బస్సు కదిలినా నవ్వు ఆగనే ఆగదు

బస్సు దిగేటప్పుడు చందమామలాంటి స్టీలు కారియరు కిందపడిపోయి పెరుగన్నం రోడ్డు పాలవుతుంది మధ్యాహ్నం భోజనం మరి! ఫ్రెండ్స్ లేరూ! పొస్తులు పెడతారా ఏం? మళ్లీ నవ్వే...

ఇంక చెప్పలేం. ఆ పిల్ల బతికే బతుకులో అందం, ఆనందం గజ్జెకట్టి ఆడుతూ వుంటుంది.

ఇట్లాంటి వొకపిల్ల వున్నట్టుండి ఇంత కవిత్వాన్నీ కాల్తో తన్నేసి ఫ్యానుకు వురేసుకొని చచ్చిపోవడం అంటే కడుపు కాలిపోదా!

ఈ చావును ఎట్లా అర్థం చేసుకోవాలి?

రేపట్నుంచీ మనం ప్యాంటూ చొక్కా వేసుకొని వీధిలోకి పోతూనే వుంటాం ఆ పిల్ల ఇక జీన్సు వేసుకొని బజారుకెళ్ళే పనేలేదే! రేపట్నించీ మనం ఏలకులు కొట్టేసిన టీ తాగుతూనే వుంటాం! రేపే మనం కమ్మటి పెండ్లి భోజనం తిన బోతాం. అయ్యో, ఇంక ఆ పిల్ల పచ్చడి మెతుకులు కూడా చూడదే! రేపట్నించీ మనం మన పెళ్ళాల పక్కన పడి పందుల్లా దొర్లుతూనే వుంటాం.

పాపం పెండ్లి చేసుకొని వొక్కపూట కూడా మొగుడి పక్కన పడుకోకనే చచ్చిపోయిందే!

పదహారేళ్ల వయసులో ఆమెకి అన్ని దారులూ ఎందుకని మూసుకు పోయాయి?

EAMCET లో డెబ్బైవేలు ర్యాంకు వచ్చింది ఆ వొక్క కారణంతో ఆమెకి లోకమంతా చీకటైపోయింది. వొద్దూ వొద్దూ నాకా దరిద్రపు లెక్కలు రావు అని నెత్తిన నోరు పెట్టుకుని అరిచినా - 50, 60 వేలు ఖర్చుపెట్టి తల్లీ దండ్రీ ఎంపీసీ చదివి try చెయ్యమన్నారు. తల్లి దండ్రుల్ని మోసం చేశామన్న భీతి! వాళ్లకి ఈ పాపిష్టి మొహం చూపించలేనన్న రోషం!

బతికుంటే ఏదోవొక చదువు చదివి పొట్టబోసుకోవచ్చులేమ్మా అని ఆ పాపకు ఏ ఆకాశవాణీ చెప్పలేదు. చచ్చిపోయింది.

ఇట్లాంటి చావులు ఒకటా రెండా!

అది హైద్రాబాదులో చిన్న పేట ఆరోజు టెన్త్ రిజల్ట్స్ వచ్చాయి. టీకొట్టు దగ్గిర పెద్దలు పేపరు చూస్తున్నారు. చిన్న పిల్లవాడొకడు నెంబరు చెప్పి చూడమన్నాడు.

పెద్దలు చూసి, "వోరే, నీ నెంబరు పోయిందిరా!" అనేసి అన్నారో లేదో ఆ పదిహేనేళ్ళ పిల్లాడు పరిగెత్తుకెళ్ళి ఎదురుగా వస్తావుండిన రైలు కింద తలకాయ పెట్టేసి చచ్చిపోయే దాకా వొంటికాలి మీద వున్నాడు.!

నిమిషం క్రితం టెన్త్‌లో వాడి నెంబరే గదా పోయింది. ఇప్పుడు వాడి బతుకే పోయింది! రైలు వాడిమీద వెళ్ళిపోయినప్పుడు - బిడ్డ ఎన్ని రకాలుగా అల్లాడిపోయినాడో!

నేనింతకు ముందు School education కి సంబంధించి, 'ఇస్కూలు పిలకాయల కత' అనీ, 'పిల్లల భాషలో Algebra' అనీ రెండు పుస్తకాలు రాశాను. ఇది మూడోది. ఈ చదువులు చదివే పిల్లలు ఎంత వొత్తిడి పడుతున్నారో చెప్పాలనే పిచ్చి సంవత్సరంగా నన్ను పీడిస్తావుంది. మొన్నటికి మొన్న కర్నూలు మెడికల్ కాలేజీలో ఒకపాప చచ్చిపోయింది. మరొకరికి ర్యాంకు వస్తే ఆ అమ్మాయికి వుక్రోషం వస్తుందంట. పరీక్షలు జరిగేటప్పుడు ఆమె ప్రవర్తనే అదొక రకంగా వుంటుందంట. తప్పు ఆమె మీదనే తోసేశారు. ఆ చావును పేపర్‌లో చూశాక, ఇంక ఈ పుస్తకం మొదలు పెట్టకుండా

తిరపతిలోనే వొక కార్పొరేట్ కాలేజీ వాళ్లు ఎంసెట్ ర్యాంకర్‌కి 3 లక్షల విలువ చేసే కారు తాళాలు ప్రెజెంట్ చేశారంట.

ఒకరోజు నా కూతురే కళనుందో ఇంటికొచ్చీ రాగానే వాళ్లమ్మను కావిలించుకుని, "అమ్మా, ఈరోజు స్కూల్లో ఐఐటీ కోచింగ్ తీసుకునే వాళ్లందరికీ టెస్ట్ పెట్టారు. పీరియాడిక్ టేబుల్‌లో ఒక్క ఎలిమెంట్ కూడా పొల్లుబోకుండా నేనొకదాన్నే రాసేసి ఫస్ట్ ర్యాంకు తెచ్చుకున్నానే!" అంది.

ప్రభావతి కులుకు చెప్పనలివిగాదు.

"ఒరేయ్! ఈ పిల్లకు ఎంసెట్‌లో ర్యాంకు గ్యారంటీరా. జ్యోతిష్కుడేరోజో చెప్పేసినాడు - మీరు బాగుపడితే మీ కూతురు గుండానే బాగుపడుతారు అనేసి. దీని పుణ్యాన మనం కారెక్కి తీరతాం!"

14 ఏండ్ల నా కూతురి మీద

30 కేజీల నా కూతురి మీద

300 కిలోల బరువూ బాధ్యతా!

భగవంతుడా! వీధికొక డాక్టరూ ఇంజనీరూ వుండారు! వాళ్లకేలోటూ లేదు.

నా కండ్ల ముందర నా కూతుర్ని వుండివ్వు. అది చాలు

(2) ఇంకో కుటుంబం కథ

ఈ కుటుంబంలో నాకు తెలిసింది వొకరే. అది పిల్లవాడి తండ్రి. పిల్లవాణ్ణి కూడా నాకు తెలియదు. పేర్లు యథాతథంగా పెట్టుకునేది లేదు కాబట్టి ఆ తండ్రి పేరు ఉమాశంకర్ అనుకుందాం

నేను హైద్రాబాద్‌లో వున్న మూడేండ్లల్లో ఆయన నాకు వొద్దనుకున్నా 20 సార్లు కనిపించి వుంటాడు ఆ ఇరవైసార్లు కూడా ఆయన-కొడుకు చదువు గురించే మాట్లాడినాడు.

ముందు ఉమాశంకర్ ఆర్థిక పరిస్థితి గురించి కొంచేపు. ఆయన ఇంటి అద్దె అయిదువేల రూపాయలు ఆయన మాటల్లోనే ఆయన కొత్తకారుకు తీసుకున్న loan తీరిపోయింది. ఉమాశంకర్ చేస్తున్న బిజినెస్ ఏ క్షణంలో wind up చేసినా partners నుంచి కనీసం పదిలక్షలు వస్తుంది. బతుక్కి గాభరా ఏం లేనట్టే లెక్క

అబ్బాయిల చదువుకి సంబంధించి ఉమాశంకర్ నుంచి నేను విన్నదంతా మీకు చిన్నకథగా చెప్పుకుంటూ వస్తా.

ఉమాశంకర్‌కి ఇద్దరు పిల్లలు చిన్నబ్బాయి గురించి మనం చెప్పుకోవా

ల్సిందేమీ లేదు. ఎందుకంటే చిన్నబ్బాయి చదువు మీద ఆయన పెద్దగా దృష్టి పెట్టలేదు వాడి tasteని గమనించి వాణ్ణి ఒక సంగీత విద్వాంసుడిగా తీర్చిదిద్దాలనేది ఆయన తపన. వాణ్ణి గురించి నాకు ఉమాశంకర్ చెప్పిందిదే. దాన్ని మీకు చెప్పేశాను.

ఇంక పెద్దబ్బాయి గురించి. వాడి పేరు హరి అనుకుందాం

ఈ హరీ గురించి వాళ్ళనాయిన చెప్పింది వినీవినీ వాణ్ణి చూడాలని నేనెప్పుడు ప్రయత్నించినా ఉమాశంకర్ పడనివ్వలేదు

హరీ మూడేళ్ళకు ముందర వొక మంచి స్కూల్లో 8th class చదివేవాడు వాణ్ణి ఎలాగైనా ఐఐటి చెయ్యాలనేది ఉమాశంకర్ ఉద్దేశం అంతకంటే ముందు రామయ్య కోచింగ్ సెంటర్‌లో వాడికి సీటు వచ్చేలా చూడడం

ఉమాశంకర్ ఒకసారి, "నామిని గారూ! ఇదొక యజ్ఞం నేనెంతవరకూ సఫలీకృతుణ్ణవుతానో కాలమే నిర్ణయించాలి. నేను మాత్రం చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నాను." అని ఆయన చేసిన ప్రయత్నాలన్నీ దఫ దఫాలుగా చెప్పినవి పాయింట్లు పాయింట్లుగా రాస్తే-

(A) మా హరీ ఉదయాన్నే నాలుగ్గంటలకి నిద్రలేవాలి మనసు ప్రశాంతంగా వుండడానికి అరగంట ధ్యానం

(B) తర్వాత కాలకృత్యాలు తీర్చుకుని, యూనిఫాం వేసుకుని రడీ అయిపోతాడు. 5 గంటలకంతా Maths, Physics, Chemistry చెప్పే ట్యూషన్ మాస్టారు వస్తాడు. 7 వరకూ ఆయన పాఠాలు చెప్తాడు తర్వాత ఎనిమిదిన్నరకంతా మరోసారి రివిజన్ చేసుకుని కప్పు నానబెట్టిన బరానీలూ, ఒక గ్లాసుడు పాలూ... స్కూలుకెళ్ళిపోతాడు.

(C) 12-45కి మధ్యాహ్నం భోజనం. డ్రైవర్ తీసికెళ్తాడు రోకటితో దంచిన దంపుడు బియ్యం భోజనం-అదీ 150 గ్రాములు మరోవంద గ్రాముల దాకా పచ్చి కూరగాయలు. గుడ్డుగానీ, మటన్‌గానీ నై. పిల్లవాడు sharp గా వుండడానికి వుడకబెట్టిన వంటలేవీ లేవు - అంతా పచ్చికూరగాయలే!

(D) సాయంకాలం నాలుగుగంటలకల్లా స్కూల్‌కెళ్లి వాణ్ణి pick up చేసుకుని 4.30 కంతా - నల్లకుంట రామయ్య కోచింగ్ సెంటర్‌లో సీటు రావడానికి తీసుకునే కోచింగ్. 7.30కి అక్కడ అయిపోతుంది

(E) రాత్రి ఎనిమిదికి ఇంటికి రాగానే మంచినీటి స్నానం అర్ధగంట ప్రశాంతత కోసం flute వాయించాలి 8 30కి పచ్చికూరలతో దంపుడు బియ్యం భోజనం.

(F) రాత్రి పదకొండు దాకా మళ్లీ subjects మీద పడడం.

- ఇలా రొటేట్ అవుతుంటుంది. దైవసాక్షిగా వొకసారి, "యజ్ఞం అని ముందే చెప్పాను కదా. సీఎంకు కూడా అంత tight schedule వుండదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే వాడికి పాస్‌పోసుకోవాలన్నా తీరిక లేదు." అనేసి అన్నాడు ఉమాశంకర్, నేను వాణ్ణి చూడాలి వాణ్ణి చూడాలి అని అంటూవుంటే నా పోరు పళ్లేక.

"పోనీ ఒక ఆదివారం వస్తా." అనేసి అన్నాను.

"ఆదివారాలు అస్సలు తీరిక వుండదు. ట్యూషన్ మాస్టార్లూ కోచింగ్ సెంటర్లూ గాడ్‌ప్రామిస్ భలే బిజీ"! అనన్నాడు.

"ఒక పండగపూట వొచ్చి మీవాణ్ణి చూడాల కావాల సార్," అన్నానొకసారి.

"మీకొక విషయం చెప్పడం మరిచాను. చాలామంది తల్లిదండ్రులు పిల్లల్ని ఐఐటిలో చేర్పించేయాలని కలలు కంటున్నారు అయితే పిల్లలకు ఐఐటిలో చేరాలన్న వూపు ఎలా వస్తుంది చెప్పు! అందుకోసమని నేను వాడిలో వుత్సాహం నింపడానికి పండగలప్పుడుకానీ, summer vacations అప్పుడు గానీ రెండు రోజులు తీరిక దొరికినా నేనేం చేస్తున్నానో తెలుసా? మద్రాసు, ఖరగ్‌పూర్ తీసుకెళ్లి ఐఐటి కాలేజీలను చూపిస్తున్నాను అక్కడి staffకి పరిచయం చేస్తున్నాను. ఇంకా local గా ఐఐటిలు చేసిన వారితో shakehand ఇప్పిస్తున్నాను. BHEL లాంటి కంపెనీలకు తీసికెళ్లి టెక్నాలజీ చూపిస్తున్నాను. ఐఐటి అంటే ఎంత గొప్పో వాడికి తెలిసొచ్చేలా చేస్తున్నాను." అనేసి గొప్పగా చెప్పాడు.

ఉమాశంకర్ చేస్తున్న పాపకార్యాలు ఇంకా ఎందుకు చెప్పుకోవడం!

భగవంతుడా! ఉమాశంకర్ లాంటి వాళ్ల కడుపున ఎందుకు కాయలు కాస్తావు!

(3) నాకు తెలిసిన ఇంకో కుటుంబం కథ

ఇది కూడా హైద్రాబాద్ దరిద్రంలో జరిగి చచ్చిందే. హైద్రాబాద్‌లో సరోజ అని వొకామె వుంది. (ఇది కూడా పెట్టుడు పేరే.) ఆమెది బంజారాహిల్స్. బంజారాహిల్స్‌లో వున్నారని కాదు కానీ నిజంగానే మహరాజులు.

సరోజకు ఇద్దరూ అమ్మాయిలే. చిన్నమ్మాయికి వొచ్చిన తక్షణ సమస్య ఏమీలేదు కానీ పెద్దమ్మాయి సంధ్యకు మాత్రం - తలుచుకుంటేనే బిత్తర ఎత్తుకునే సమస్య.

సావధానంగా ఈ దరిద్రపుగొట్టు కథ వినండి. సరోజకు ఇద్దరు కూతుర్లుగదా పెద్దపాప సంధ్య ప్రస్తుతం పదో తరగతి దీన్నట్లా వుంచండి

సంధ్యకో మేనమామ వున్నాడు. అంటే సరోజకు అన్నయ్యా ఆయనకో కొడుకు. వాడు వజ్రమైపోయాడు. వాడు EAMCETలో బిలో హండ్రెడ్ ర్యాంకు తెచ్చుకుని వైజాగ్ మెడికల్ కాలేజీలో 1st year M B B.S జాయినైపోయాడు.

మేనమామ కొడుక్కి ఎంబీబీఎస్‌లో సీటు దొరికిందని ఎగిరి గంతేసిన సంధ్య క్షణంలో గతుక్కుమంది.

ఇంట్లో యుద్ధవాతావరణం నెలకొంది

"మా అన్నయ్య నన్ను కాదని పోడు ఖచ్చితంగా సంధ్యనే కోడలిగా చేసుకుంటాడు. పిల్లవాడు కూడా సంధ్య అంటే లోపల్లోపల పడి చస్తూనే వున్నాడు. కానీ పైకి డైరెక్టుగా అనెయ్యలేడు కదా మొన్నటికి మొన్న డాక్టరయ్యావుకదా ఇంక మమ్మల్నెక్కడ పట్టించుకుంటావులే అని చూశా వాడు నాన్చకుండా తేల్చేశాడు. సంధ్యను బాగా చదివించండి. ఇదే కాలేజీలో మెడిసిన్‌లో చేరాలి పెళ్లి నేనెందుకు చేసుకోను? కానీ మీరు సంధ్యను బి ఎ చదివిస్తే మాత్రం మర్చిపోండి - అని చెప్పేశాడు దీనికి చీమకుట్టినట్టయినా లేదు"

ఇంక ఆ ఇంట్లో మనశ్శాంతి లేకుండా పోయింది.

సంధ్య చదువుల గురించి చూస్తే మతిపోయింది. స్కూల్లోనే ర్యాంకు రావడం లేదు. Maths లో 100కి 70 ఎప్పుడూ దాటడం లేదు

ఎంత డబ్బయినా సరే ఈ సంవత్సరంలో సంధ్యను సాన బెట్టాలని రంగంలోకి దిగింది సరోజ హైద్రాబాద్‌లో Maths లో expert ఎవరు? ఇంటికొచ్చి అయినా ఎవరు చెప్తారు? నెలకు రెండు వేలైనా కేర్ ఎ జాట్!

అప్పుడీ పనికిమాలిన Maths expert పేరెవరో చెప్పినారు నిమిషంలో నాకు phone. ఇంటిముందరికి గంటలో కారు!

నేను బంజారా హిల్స్‌లో హాజరు!

"ముందు మా అమ్మాయి maths లో ఎంతమటుకు వుందో కాస్తా చూసి చెప్పండి!" అని నన్ను ప్రాధేయపడింది సరోజ.

నేనో దరిద్రపు మొహంవేసి నాడి పట్టుకుని చూశాను "ఇప్పట్నించీ శ్రద్ధపెట్టి చెప్పిస్తే టెన్త్ పాసవ్వచ్చు ఆ అమ్మాయికి $(a+b)^2$ ఫార్ములా కూడా రావడంలేదే!" అని నేను ఆపరేషన్‌కు సిద్ధం చెయ్యండి అన్నట్టు చెప్పేశాను.

మధ్యాహ్నం 12 గంటలకి వెళ్లిన వాణ్ణి రాత్రి ఎనిమిది దాకా నేను ఆ

ఇంట్లోనే వుండిపోవాల్సి వచ్చింది. లక్ష రూపాయలైనా సరే ఎక్కణ్ణించైనా మంత్రజలం తెప్పించి ఆ పిల్లనెత్తిన చల్లి సూత్రాలు వచ్చేలా చెయ్యమని వాళ్ళు కోరారు

నా మాటల్ని బట్టి అది నా చేతుల్లో లేదని తెలిసి వాళ్ళు నిరుత్సాహపడి వేరేచోటికి phone చేసి రేపట్నించే ముగ్గురు ట్యూషన్ మాస్టార్లను arrange చేసుకునే పనిలో పడిపోతుంటే - నేను బైటికొచ్చేశాను.

సరోజ తపన చూసి సంధ్య ఒక మాట అనింది ఆ మాట చెప్పేసి ముగించేస్తాను.

"మా అమ్మ సంగతి నాకు బాగా తెలుసంకుల్. నా ప్రాణం తీసేదాకా మా అమ్మ మంచినీళ్ళు కూడా ముట్టదు."



# తల్లీ, తండ్రీ, గురువూ -
# ఈ మూడు దెయ్యాల భాష !

నవనీత టెన్త్ చదువుతోంది పాప రెండు ఇడ్లీల్ని కొరికి తినేసి స్కూలుకెళ్లే పనిమీద వుంది గండరగండడైన తండ్రి భలే కోపం మీద వున్నాడు దాన్ని ఆయన అమ్మమీద చూపిస్తున్నాడు.

తండ్రి అన్నాడు తల్లితో· "తల్లి చాలు బుల్లిపిల్ల అన్నారు తల్లి రీతిగా వుంటే గదా కూతురు రీతిగా వుండేదానికి ఆ పిల్లను టెన్తే ఫెయిల్ అవ్వనీ, నీ కథ చెప్తా. నువ్వోనేనో ఎవురో వొకరు వుండాల ఈ ఇంట్లో ! ఫీజులు కట్టే వరకు నేను చూసుకుంటాను గాని ఆడది చదివించాలా వొద్దా! ఇప్పుడెందుకు మాట్లాడ్డం! టెన్త్ అవనీ..."

తల్లి కుక్కిన పేను మాదిరిగా పడివుంది. ఆయనేదో కోపంలో వున్నాడు పాపం! మాట్లాడుకోనీ... అరిచి అరిచి ఆయనే గమ్మనుంటాడు - ఇదీ తల్లి ఎత్తుగడ!

నవనీత కొంపలో నుంచి బైటపడింది గండరగండడు కూడా డ్యూటీకి వెళ్లిపోయాడు.

తల్లి గబగబా స్కూలు కరస్పాండెంట్‌కు ఫోను చేసింది!

"కరెస్పాండెంటు సార్ నేను సార్ నవనీత వాళ్లమ్మని. మొన్న యూనిట్ టెస్ట్‌లో మార్కులు చూసి మా ఇంటాయన తెల్లారి ఇక్కడెగిరి అక్కడ దూకినాడు సార్. మా ముండను కొంచెం పట్టించుకోండి సార్. అదేంది సార్ తెలుగులో కూడా ఫెయిలయ్యింది! ఆ పిల్ల ఫెయిలయితే ఈ కోపగల్లోడు నన్ను బతకనీడు సార్. కొంచెం చూడండి సార్. మాకేం ఆస్తులు కూడా

లేవుసార్ పిలకాయల్నయినా రీతిగా చదివించుకోకపోతే ఎట్ల అనేది ఈయన మతం సార్. రానిదీ పోనిదీ చెప్పించే వగలేదు గానీ నన్నుపట్టుకుని పెంపకం సరిగ్గా లేదని సాధిస్తా వుంటాడు సార్. బాధ్యత మీదేసార్. మాకేమీ 500లూ, 540లూ వొద్దుసార్. పాసయిపోయేటట్టు చూడండి సార్."

కరస్పాండెంట్ కుర్చీలో నుంచి లేచి టెన్త్‌క్లాసులోకి వెళ్లి నవనీతను పైకి లేవమన్నాడు

నవనీత బిత్తర చూపులు చూస్తా పైకి లేచింది.

"ఏమమ్మా తెలుగులో కూడా ఫెయిలవుతారా ఎవరైనా? నీకు సిగ్గులేదా! కడుపుకు ఏం తింటున్నావ్? ఇట్లరా బోర్డు దగ్గిరికి! అసలు నీకు చదవడం రాయడం అన్నా వచ్చా రాదా మొద్దు మొహమా! రాయి, ఆశయసాధన రాయి."

నవనీత చాక్‌పీసు తీసుకుని కష్టంగా ఆశయసాధన అనే దాన్ని రాయ బోయింది.

ఆ పిల్ల రాసిందాన్ని చూసి కరస్పాండెంటుకు వున్న మతి కాస్తా పోయింది

"ఆహా నీకు గుణింతాలు కూడా రావన్నమాట. కోస్తే నాలుగూళ్లకు సరిపోయేటట్టున్నావు గదే దున్నపోతా! వొత్తుల్లేని పదం కూడా రాయలేక నిగిడి చస్తున్నావే! ఛా!" అనేసి కరస్పాండెంటు తెలుగు పుస్తకాన్ని తీసుకుని స్ట్రీట్ చిల్డ్రన్ అనే పద్యభాగంలో డిక్టేషను ఇచ్చాడు

అరిచేతులకు పట్టిన చెమటను గుడ్డకు తుడుచుకుంటూ నిలబడి పోయివుంది నవనీత. క్లాసుక్లాసంతా pındrop sılence.

"ప్రముఖ కవయిత్రి మహెజబీన్ గొప్ప సంఘసేవికురాలు."

ఈ వాక్యాన్ని ఆయన రెండుసార్లు అరిచి అరిచి చెప్తే నవనీత ఇట్లా రాసింది

పురామక్క. కవియత్యి. మహచజీన. గప్పా. చెంగా. చావుకరాలె.

వొళ్ళు తెలవని కోపం వచ్చేసింది కరస్పాండెంటుకు.

"నిన్నట్లనే నిలువున చీల్చేస్తే పాపమా! టెన్త్ అంటే నీకు సిగ్గుగా లేదా! వొక్క ముక్క కరెక్ట్‌గా రాశావా నువ్వు. వాక్యం చివర ఫులుస్టాప్ పెడతారు గానీ పదపదానికీ ఫులుస్టాప్పులు పెట్టుకుంటూ పోతారా ఎవరైనా?" అనేసి టేబిలు మీదున్న బెత్తం తీసుకుని అచ్చంగా గొడ్డును బాదినట్టు బాదేశాడు.

బేర్ బేర్‌మని ధైర్యంగా ఏడ్వడానికి కూడా ఆ పాపిష్టి పిల్లకు వొప్పలేదు. నన్ను మీ ఇష్టం వచ్చినట్టు కొట్టండి సార్, నాకు పడాల్సిందే లే అన్నట్టు అన్ని దెబ్బలూ తింది.

తర్వాత కరస్పాండెంటు ఆ వాక్యాన్ని రాసి చివర మాత్రమే ఫుల్‌స్టాప్

పెట్టి, "బాగా చూడు. ఒకసారి చదువు. ఫుల్‌స్టాప్ పదపదానికీపెట్టానేమో చూడు." అని డస్టర్‌తో తుడిచేసి ఆ వాక్యాన్ని నవనీతను ఇప్పుడు రాయ మన్నాడు.

అంతకంటే తమాషయిన తప్పులతో, అన్ని గాకపోయినా ఒకటి రెండు ఫుల్‌స్టాప్పులు తగ్గించి మళ్లీ అట్లనే రాసింది నవనీత.

ఆ పిల్లకు పాపం రాయను చేతకావడం లేదనీ, ఆ పిల్లను కొట్టే బదులు ఈ పదేళ్లూ ఆ పిల్లకు పాఠాలు చెప్పిన టీచర్లను కొట్టాలనీ ఆయన గ్రహించలేక పోయాడు.

"ఏయ్! నేన్నీకంటికి ఎట్లా కనిపిస్తున్నాను? ఏం ఎగతాళిగా వుందా? నిన్ను ఉప్పుపాతర వేసినా పాపం రాదు!" అనేసి బెత్తంతో ఆయనకు వొళ్ళు అలిసిపోయేలా కొట్టేసి అదే పోతా!

నవనీత ఏం చేస్తుంది! కడుపులోనే కాసేపు ఏడ్చుకుంది స్కూలూ, ట్యూషనూ ముగించుకుని రాత్రి ఎనిమిదిన్నరకు ఇంట్లోకి పోయి నేరుగా బాత్‌రూం తలుపులేసుకుని - బాత్రూం కడుగుతారే యాసిడ్ -దాన్ని తాగేసింది.

చచ్చినా పీడా బోయేది గానీ - డాక్టరు దగ్గిరికెళ్లి జల్సాగా రెండు వేలు ఖర్చుపెట్టించి, ఆ ఉదయాన్నే డిశ్చార్జి అయింది

ఆ మరసట్రోజు, నవనీతతో తల్లి ఇట్లా అంది

"అమ్మా తల్లీ! నువ్వు చదివితే చదువు చదవకపోతే పో అంతేగానీ బుడ్డ బెదిరింపులకు దిగద్దు. చదవకపోతే నువ్వు గదా పోతావు. మాకేమి?"

తండ్రి ఇట్లా అన్నాడు

"అక్కడెక్కడన్నా చావనీ! కన్న నేరానికి టెన్త్ ఫెయిలవ్వగానే ఎవణ్ణో ఒక పంగమాలిన వెధవను చూసి తగిలించేస్తే పోతుంది!"

కరస్పాండెంట్ ఇట్లా అన్నాడు.

"నువ్వు నేర్చిన మంత్రాన్ని అందరికీ వూదొద్దు. తాచెడ్డకోతి వనమెల్ల చెరిచిందనీ! ఛీ, నీ మొహం చూస్తేనే గోవును చంపినంత పాతకం!"

(2) స్వర్ణ స్కూలికి రడీ అవుతోంది ఒక్క దోసెని అట్లా నంజుకుని చెంబుడు నీళ్లు తాగేసింది.

తల్లి రెండు జళ్లేసేసి టీ తాగుతూవుంది స్వర్ణ అద్దం చేతిలోకి తీసుకుని గుండ్రటి మొహానికి Fair and Lovely పూసుకుని తిప్పించి మళ్లించీ చూసుకుంటోంది.

"చదువులో పసలేదు గానీ షోకులకేం కొదవలేదు పుస్తకమెత్తి నిమిషం ముందర పెట్టుకోదు కానీ అద్దం తీసుకుంటే మాత్రం వాళ్ళే తెలవదు బిడ్డ చదివితే ముచ్చట. ఈ సోకులు చేసుకుంటే కాదు! ఆ సుజాతను చూడు. పుట్టక అంటే అదీ! school first అంట ఆ పిల్ల చదివే స్కూలే కదా నువ్వూ చదివేది! ఆ పిల్లకు చెప్పే టీచర్లే కదా నీకూ చెప్పేదీ! అయినా మన తలకాయలో బంకమట్టి కదా వుండేది! దాని వుచ్చయినా తాగు పనికొస్తావేమో చూద్దాం!" అంది తల్లి టీ కావాలిస్తే మళ్ళీ తాగచ్చు, ఈ మాట అనేద్దామని

ఈ అన్ని మాటలకూ స్వర్ణ, "నువ్వు కొంచేపు మూస్తావా!" అంది తల్లిని

జెండామాను మాదిరిగా పైకి లేచేసింది తల్లి

"అన్నంతమాట అనొద్దని నీకెన్ని సార్లే చెప్పేది! లంజాముండా! గంపడంత నోరేసుకుని తిరగబడేది తెల్సే! చదివేది తెలియదా! దాని వుచ్చతాగమనే సరికి అంత పొడుచుకొచ్చిందే! ఆ రోషం చదువులో చూపించు వచ్చే యూనిట్ టెస్ట్‌లో ఆ పిల్లకంటే ఎక్కువ మార్కులు తే! అదీ రోషం అంటే..." అని స్వర్ణ రెండు జళ్లనీ పట్టుకుని నులిమేసింది

స్వర్ణ కళ్లల్లో నీళ్లను కళ్లల్లోనే కుక్కుకుంటూ స్కూలికి బైల్దేరేసింది.

ఇళ్లల్లో స్కూళ్లల్లో ఇట్లాంటివి కొన్ని వందలు ..

★ చంద్రకుమార్ ఆ క్లాసులో ఫస్ట్‌ర్యాంకు వచ్చాడు. వాడి చొక్కాకొక ఫస్ట్ ర్యాంకర్ బ్యాడ్జీ తగిలించి మిగతా పిల్లల్తో అంటాడు క్లాస్ టీచరు

"చంద్రకుమార్ దిగ్రేట్ అంటూ చప్పట్లు కొట్టండ్రా!"

★ టీచరు క్లాసులోకి రాగానే పిల్లలంతా పైకి లేస్తారు. టీచరు కుర్చీలో కూర్చుంటూ, "హోంవర్కు చేసుకురాని వాళ్లు నిలబడి చేసిన వాళ్ళు కూర్చోండి"

సగంమంది నిలబడే వుంటారు

"ఈ రోజు మీ మెడకాయల మీద తలకాయలుండవ్ భగవంతుడు కూడా మిమ్మల్ని కాపాల్లేడు"

★ ఏదో వొక బిట్‌కు వొక పిల్లాడే సమాధానం చెప్తాడు పదిమంది చెప్పలేరు. విజేతతో సార్, "చెంప దెబ్బలు వెయ్, గంధం పూసినట్టు కాదు గంట కొట్టినట్టు వినపడాలి"

★ "అమ్మా తల్లీ! నీకెన్నిసార్లు చెప్పినా నీకీ ఫార్ములా రాదు. నీకు పవన్ కళ్యాణ్ మీద వుండే శ్రద్ధ సబ్జెక్టు మీద లేదు"

★ స్టడీ అవర్‌లో ఒకమ్మాయి గంట చదివినా రెండు మార్కుల క్వశ్చన్ కూడా కంఠస్తం పెట్టి సార్‌కు అప్పజెప్పలేక పోతుంది.

అప్పుడు మర్యాదస్తుడైన ఆ సారు "ఎందుకమ్మా నీకు చదువు! నీకు రాదు నా మాటవిని స్కూల్‌కు నిల్చిపో. ఒక్క ఆవుగొడ్డును పట్టుకుని మేపుకుంటే అది పాలిస్తుంది అమ్ముకోవచ్చు, తాగవచ్చూ. అది పేడేస్తుంది. పిడకలు తట్టుకోవచ్చూ గొడ్లు మేపడం అంత నామోషీ అయితే ఎక్కడైనా టైలరింగ్ నేర్చుకోమ్మా. ఏడులోనే నువ్వు టైలరింగ్‌లో చేరినావనుకో ఎనిమిది కంతా గుండీలు కుట్టేది నేర్చుకునేసి వుంటావు ఈ పాటికంతా పావడలూ రవికలూ కుట్టేది వొచ్చేది కదా!"

★ అది రిజల్ట్స్ వచ్చిన రోజు కూతురికి 380 మార్కులు వచ్చివుంటాయి

తల్లి నిష్ఠూరం "దీన్ని ఇంటర్‌లో చేర్చడం దండగ మళ్లీ 30వేలు ఖర్చు ఎవరు తిన్న పాడు! ఆ మార్కులకే నిలవలేక పోతుంది చూడు మన పనిమనిషి కూతురికొచ్చాయి 402. దాని ముందు తలెత్తుకోలేకున్నాను"

అప్పుడు తండ్రి ఇచ్చిన చాన్స్ "చూద్దాం ఇంటర్‌లో ఏం చేస్తుందో! నువ్వు discourage చెయ్యబాక"

★ చివరగా ఒకటి, ఆణిముత్యం An ఎలా పెట్టాలో భలే చెప్పేశాడు ఇంగ్లీషు సారు. అర్థమైందనుకుంటే క్లాసులో 40 మందిలో 28మంది University ముందు An పెట్టేశారు.

అప్పుడు దూర్వాసులసారు "మిమ్మల్ని చంపేసి జైలుకెళ్లిపోతాన్రా!"

# Magic figure 500 కోసం ఇదేమైనా పద్ధతిగా వుందా?

సెవెన్త్ చదివే పిల్లవాడికొకడికి భలే కష్టం వచ్చిపడింది. వాళ్ల హెడ్ మిసెస్ - పిల్లల క్వార్టర్లీ పరీక్షల ప్రోగ్రెస్ రిపోర్టుల్ని ఫ్యాను కింద కూర్చుని చూస్తూ చూస్తూ వీడిది పట్టుకుంది. వాచ్‌మన్‌ని కేకేసి పిల్లవాణ్ణి పిలిపించుకుంది

"ఎందుకురా మీలాంటి మొద్దుమొహాలంతా స్కూల్‌లో చేరి మా దుంప తెంచుతారు? మేం బాగా బతకడం మీకు ఇష్టంలేదా? ఛాఛా . రేపు మీ పేరెంట్స్‌ని పిల్చుకురా!" అని ఆర్డరేసింది

తల్లి స్కూలుకెళ్లింది.

"అమ్మా తల్లీ! వొక యూనిట్‌టెస్ట్ చూశాం. వీడేమీ డవలప్ కావడం లేదు. రోజురోజుకీ బండరాయి అయిపోతున్నాడు. ఇంక మావల్లా కాదు. టీసీ ఇచ్చేస్తాను తీసుకెళ్ళండి. వీణ్ణి సెవెన్త్ పాస్ చేయించడం మా తరం కాదు. మీన్ మెథడ్స్ ఫాలో అయి సెవెన్త్ పాస్ చేయించే చరిత్ర మా స్కూలికి లేదు. అట్లాంటి స్కూళ్లు వీధికి నాలుగేసి వున్నాయి. అక్కడెక్కడైనా చేర్చుకోండి." అని హెడ్‌మిసెస్ క్లర్క్కేసి చూసింది.

క్లర్క్కు టీసీ బుక్ కోసం వెతుకులాడబోయాడు

ఈ తల్లి గుండికాయలు నీళ్లయిపోయినాయి.

తొలుత, "అట్లా అనేస్తే ఎట్ల మేడమ్! Half Yearly పరీక్షల దాకా చూడండి. అప్పటికీ మేం ఇంటి దగ్గర శ్రద్ధగా చదివిస్తూనే వున్నాం. ఇంకా చదివిస్తాం. అర్లీ మార్నింగ్ ట్యూషన్ కూడా పెట్టిస్తాం." అని కాళ్లావేళ్లా పడింది

హెడ్‌మిసెస్ చిరాకు పడిపోయి. "మీకు దండం పెడతానమ్మా ఇట్లాంటి వాళ్లవల్ల మా స్కూల్‌కి చెడ్డపేరొస్తుంది దీన్ని నమ్ముకుని ఎంతమంది బతుకుతున్నామో తెలుసు గదా మీకు పుణ్యం వుంటుంది మీ కాళ్లు పట్టుకుంటా ఇంకొక్క మాట మాట్లాడకుండా మీరు టీసీ తీసికెళ్ళండి." అని దౌర్జన్యానికి దిగింది

దేముడు రాసిపెట్టినట్టు జరిగేది జరుగుతుందని తల్లి తెగాయించేసింది "మంచి స్కూలుకదాని మూడువేలు డొనేషను కట్టి ఎల్‌కేజీలో చేర్పించాం అప్పట్నించి పిల్లాడు మీ స్కూల్లోనే చదువుతున్నాడు. నెలనెలా 150 extraగా కట్టి సాయంకాలం tution కూడా మీ స్కూల్లోనే పెట్టాం ఇప్పుడు వాడు డవలప్ కాలేదంటే ఎట్లా మేడమ్! అది మాతప్పు ఎట్లా అవుతుంది ఇయర్ మద్యలో టీసీ ఇచ్చేస్తానంటే ఎట్లా మేడమ్." అని అడిగేసింది పిల్లవాడు ఏడస్తా నిలబడి వున్నాడు నెమిలికంట్లో నీళ్లు కారితే వేటగాడికేం? హెడ్ మిసెస్ టీసీ ఇచ్చి తరిమేసింది

వాణ్ణి ఇంకో స్కూల్లో చేర్పించారు. దీంతో వాడికీ, వాడి తల్లిదండ్రికీ తలగొట్టేసినట్టయింది. వాణ్ణి బాగా చేరదీసే వాడి మేనత్త దగ్గిర వాడు అన్నాడంట "నాకు చచ్చిపోవాలనుంది అత్తా!" అని ఇది నేను వాడి తల్లి ద్వారా విన్న కథ. ఇంక నేను నా కండ్లతో చూసిన కథ

నేనప్పుడు హైద్రాబాద్‌లో వున్నాను. నేను రాసిన పిల్లల భాషలో Algebra చదివి వొక స్కూల్ కరెస్పాండెంట్ నన్ను పిలిపించి, " మే 1st నుంచీ June 15న school re-open అయ్యేదాకా Algebraకు సంబంధించిన fundamentals చెప్పండి, ఆరో తరగతి నుంచి పదో తరగతి దాకా. మీరు ఉదయం ఆరుకొచ్చి మధ్యాహ్నం పన్నెండు దాకా చెప్పాలి. ఆ వొకటిన్నర నెలకూ 20 వేలు ఇవ్వగలం " అన్నాడు

నేను ఎగిరి గంతేశాను కరువులో అధికమాసం నా పరిస్థితి అప్పుడు నెలకు 13వేలు గిట్టుబాటవుతుంది అంత జీతాన్ని నా జీవితంలో చూళ్లేదు

హమ్మయ్య, పిల్లలకు Algebra లో వుండే మర్మాలన్నీ చెప్పేసెయ్యొచ్చు అనే వుత్సాహం ఏమూల వుండిందో కానీ, ఒకటిన్నర నెలలో 20వేలు అనే వుత్సాహం నా వొళ్లంతా ప్రవహించేసింది

(ఇస్కూలు పిలకాయల కత అని నేనొక పుస్తకం రాశానని చెప్పాను గదా అందులో తెలియనితనంతో schools పేర్లూ, వ్యక్తుల పేర్లూ యధాతథంగా

రాసేసి తలకాయనెప్పి తెచ్చుకున్నాను. అందుకు నొచ్చుకున్న వొకామె, "వాణ్ణి లేపెయ్యడం అనేది నాకు చిటికేసినంత పని. అంతదూరం ఎందుకులే అని - మా వాళ్లని వొద్దూ వొద్దూ అని వారిస్తున్నాను." అందంట.

నేను భలే భయస్తుణ్ణి. ఏ స్కూల్ని గానీ, ఏ అయ్యవారిని గానీ పలచన చేసేసి వాళ్ల ఆదాయాలను దెబ్బతీసేద్దామని నేనీ పుస్తకాల్ని రాయడం లేదు. అదొక పిచ్చి అని చెప్పాను గదా. అందుకని నన్ను క్షమించి విడిచి పెట్టేయండి. చంపేసే అంత దూరం ఎందుకు? నన్ను చూసి కాకపోయినా నా ముగ్గురు బిడ్డల్ని చూసైనా అట్లాంటి ఆలోచనలు చెయ్యకండి.

ఆ భయంతో నేనీ పుస్తకంలో అన్నీ దొంగపేర్లే వాడుతున్నాను )

ఇక్కడ కూడా ఆ స్కూలు పేరు నేను వాడడం లేదు నిద్రలేచి సెవెన్ సీటర్ ఆటో పట్టుకుని ఆ స్కూలుకు చేరేవాణ్ణి.

ఆరోగంటకంతా ఈ నిపుణుడి దగ్గర Algebra నేర్చుకోవడానికి ఆరో తరగతి పిల్లలంతా రడీగా క్లాసులో కూర్చుని వుండేవాళ్లు

నేనొక కొండముచ్చు మాదిరిగా క్లాసులోకి ఎంటరయ్యాను.

Summer vacations అప్పుడు కూడా ఈ నాకొడుకొకడు - అన్నట్టు నాకల్లా చూశారు పిల్లలు.

నిజమే కదా మరి. నేనక్కడ చేసిన పాపకార్యం చాలా వుంది. నా దరిద్రం కొద్దీ నేనక్కడకు వెళ్లి Algebra చెప్పి పబ్బం గడుపుకున్నాను గానీ వాస్తవం మాట్లాడాలంటే చాలా వుంది.

నేను జాతయిన వాణ్ణయివుంటే, "Summer vacations లో వొద్దులెండి సార్. మీకంత కావాల్సివస్తే School re-open అయ్యాకే వస్తాను " అని ఆ కరస్పాండెంట్‌తో అని వున్నాననుకోండి. 6th, 8th, 9th పిల్లల నెత్తిన పాలుపోసి వుండేవాణ్ణి. సెవెన్త్‌కీ, టెన్త్‌కీ సమ్మర్‌క్లాసులు తప్పవు. అది వేరే కథ మళ్ళ దాంట్లోకే వస్తా.

Algebra కంటే ఈత గొప్పది. వాళ్లు Algebra ను School re-open అయ్యాక క్లాసుల్లో అయినా నేర్చుకుని వుంటారు ఈత క్లాసుల్లో నేర్చుకునేది కాదుకదా

ఆ సమ్మర్‌లో వాళ్ళు వూళ్లకి వెళ్లివుంటే బావుల్లో ఈతలు కొట్టుకునేవాళ్ళు. ఈ హైద్రాబాద్‌లో గ్యాసువల్లా మాగిన మామిడి పళ్లు కాకుండా - మామిడి తోపులో అప్పుడే మాగిన చెట్టునుంచి పండును తెంపుకుని మరీ తిని వుండేవాళ్ళు

వూళ్లో అమ్మమ్మల్తో, నాయినమ్మల్తో వోహో కాలం కేళీ విలాసంగా గడిచి వుండేది.

నావైపునుంచి నేనుచేసిన తప్పు ఇదైతే కరస్పాండెంటు ఆలోచనలు వేరే.

"వీణ్ణేదో Algebra లో expert అనీ, పిల్లలకు ఈజీగా చెప్తాడనీ అంటున్నారు. ఒక సమ్మర్‌లో వీడి చేత క్లాసులిప్పించి చూద్దాం. పిల్లలు లెక్కల్లో మెరికల్లా తయారైతే స్కూలికి పేరు గదా."

ఆ రకంగా సమ్మర్‌క్లాసు వొకటి తీసుకుంటుండగా పక్కక్లాసులో జరిగిన కథే ఇది. అసలుది.

పక్క క్లాస్‌లో టెన్త్ Maths జరుగుతోంది మరి, సమ్మర్‌లో వాళ్లని వూళ్ళకి పంపించేస్తే ఎట్లా? సెవెన్తూ, టెన్తూ పబ్లిగ్గదా. సమ్మర్‌లోనే పాతిక భాగం సిలబస్ అయినా అయిపోవాలి

సెవెన్తూ. టెన్తూ సిలబస్సు డిసెంబరుకంతా అయిపోతే గదా తర్వాత రివిజను. అందుకని పక్క క్లాసులో Maths టీచరు జామెట్రీ చెప్పేస్తున్నాడు.

ఈ క్లాసులో వున్నవాణ్ణి పక్క క్లాసులో జరిగిందాన్ని అప్పటికప్పుడు ఎలా వూహించను? వున్నట్టుండి ఆ క్లాసులో గోల లేచిపోయింది. ఒకరిద్దరు పిల్లలు బేర్ బేర్‌మని ఏడ్చేస్తున్నారు. కొడుతున్నాడేమోలే అనుకున్నాను ఆ టీచరు కూడా క్లాసు బైట వచ్చేసి చెంబుతో చెంబుడు నీళ్ళు తీసికెళ్తున్నాడు. ఆ తర్వాత తెలిసిందిదీ..

మోహన్ అనే పిల్లవాడు - నాలుక బైట పెట్టేసి తేలకళ్లు వేసేసి స్పృహ తప్పి పడిపోయాడు. ఒకవేళ చచ్చేపోయాడేమో అని కూడా పిల్లలు బిత్తరపోయారు.

ఆ రోజు ముందు క్లాసులో Maths సారు basic proportional theorem ను 20 సార్లు రాసుకురమ్మన్నాడు. సుమారు 30 pages home work. దాన్ని ఈరోజు క్లాసులో చూడకుండా రాయాలి. అది అయిదు మార్కుల క్వశ్చను, important మరి. ఆ theorem రాకుండా పిల్లల్ని exams కి కూర్చోపెట్టలేం. ఇప్పణ్ణించీ తయారు చేస్తే కదా!

వీడు మోహన్ దాన్ని 20సార్లు రాసుకోనీ రాలేదు, ఇక్కడ క్లాసులో చూడకుండా రాయనూ లేదు. అయిదారు మంది పిల్లలు ఆ theorem ను చూడకుండా కూడా రాసేసి సార్ మెప్పుపొందారు. మిగతా 15మంది హోంవర్కయితే రాశారు గానీ ఇక్కడ రాయలేకపోయారు. కనీసం సార్ ఇచ్చిన వర్క్ చేసుకుని వచ్చారు. అక్కడికైతే సార్ గౌరవాన్ని కాపాడారు గదా దెబ్బలు

తప్పించుకున్నారు

మోహన్ మాత్రం తప్పించుకోలేక పొయ్యాడు. Maths సార్ వీడి మీద తోడేలు లాగా పడి వీపుమీద ఇరవయ్యో ముప్ఫయ్యో పిడిగుద్దులు గుద్ది అలిసిపొయ్యాడు. ఇదికాదు మంత్రం అనుకుని `వంద గుంజిళ్లు తియ్!' అనేసి హూంకరించాడు

పాపం, గుంజిళ్లు తీశాడు. 80 తీశాక ఇంక వల్ల కాదన్నట్టు వొళ్లంతా చెమటలు పట్టేసి వొణుకు వచ్చేసి స్పృహ తప్పి పడిపోయాడు అది దొంగవేషం లెండి అని పాఠం చెప్పబోయిన సార్ చివరికి మొహాన నీళ్లు చిలకరించి చూశాడు. వాడు కళ్లు తెరిచాడు. కద సుఖాంతం!

మోహన్ చచ్చిపోయి వుంటే అది వేలెడు న్యూస్ అయ్యేదేమో గానీ ఇప్పుడది న్యూసే కాకుండా పోయింది కాలకృత్యాలు కూడా తీర్చుకోకుండా పరగడుపున్నే క్లాసుకు పరిగెత్తుకు వచ్చిన పిల్లవాడు పాపం! కడుపు ఖాళీగా వుంటుంది నిద్రలేచి వచ్చిన పిల్లవాడికి ఏం పుష్టి వుంటుంది! ఆ సార్ కూడా బిడ్డలు గల్లవాడే గదా. ఆ టైంలో వంద గుంజిళ్లు తీయించడానికి ఆయనకు మనసెలా వొప్పింది!

ఆ Maths సార్ పేరు రాజూ సార్ అనుకుందాం. నేను మెల్లగా ఆ సార్‌తో స్నేహం చేశా, ఆయన భావాలు కనుక్కుందామని ఆ వొకటిన్నర నెలలో ఆయన భావాలు కొన్ని నేను తెలుసుకో గలిగాను

రాజూసార్‌కి ఆ స్కూల్‌లో గానీ, ఆ కాలనీలోగానీ, చక్కటి పేరు వుంది. పిల్లలు మటుకు `యముడు సార్' అని పిలుచుకుంటారు ముద్దుగా యముడు సార్ నిజంగానే దిట్టంగా వుంటాడు ఆయన నాలుగు స్కూళ్లల్లో Maths చెప్పుకుని ఒక అపార్ట్‌మెంటు కూడా కొనుక్కున్నాడు.

ఆయన అంటూ వుంటాడు. "మీరు ఎన్నయినా చెప్పండి సార్. దేముడికైనా దెబ్బే గురువు. సార్ నాలుగు తంతాడు అనే భయం వుంటేనే పిల్లలు వర్క్ చేసుకొస్తారు నేను అనుభవం మీద చెప్తున్నాను - పిల్లలు కొట్టకుంటే చదవరు."

నేనక్కడ క్లాసులు తీసుకుంటూ వుండగానే - టెన్త్ రిజల్ట్స్ వచ్చాయి. ఆ మరసట్రోజే ఈనాడు పేపర్‌లో School యాడ్ వచ్చింది. టెన్త్‌లో 100% పాస్. ఇరవైమందిలో అయిదు మందికి 500 కూడా దాటాయి.

ఇప్పుడొచ్చాం అసలు విషయంలోకి. 7th, 10th లో రెండే రెండు magic figures 100%, తర్వాత 500 వీటికోసం స్కూళ్లు రకరకాల పద్ధతులు పాటిస్తాయి. ఈ మాత్రం ఫలితాలు సాధించడానికి ఆ స్కూలే కాదు దాదాపు

90% స్కూళ్ళు పాటించే పద్ధతులు

(1) పిల్లలు ఉదయం నాలుగు గంటలకు నిద్రలేచేసి నాలుగున్నర కంతా స్టడీఅవర్ కొచ్చేయాలి. అక్కడ వొకరిద్దరు సార్లు బెత్తాలు చేతపట్టుకుని, పుస్తకాన్ని ముందరేసుకుని తూగేవాళ్ళ నెత్తిమీద నాలుగేసి నిద్రలేపుతూ చదివిస్తుంటారు

(2) 7.30కి స్టడీఅవర్ అయిపోతుంది. తర్వాత ఇండ్లకెళ్లి రడీ అయిపోయి 8.30 కల్లా వచ్చేయాలి.

(3) ఉదయం తొమ్మిది నుంచీ స్టడీ అవరయితే స్టడీ అవరూ, సిలబస్ కాకపోతే సిలబస్సూ జరుగుతాయి.

(4) సాయంకాలం నాలుగున్నరకు మళ్లీ స్టడీ అవర్లు మొదలవుతాయి డౌట్‌లేమైనా వుంటే సార్‌లను అడిగి తెలుసుకోవచ్చు.

(5) రాత్రి ఎనిమిది గంటలకు ఇండ్లకెళ్లి అంత తిన్నామనిపించేసి మళ్లీ స్టడీ అవర్లు అవి తొమ్మిది నుంచి మొదలై రాత్రి పదకొండు దాకా జరుగుతాయి.

(6) రాత్రి పదకొండుకు ఇండ్లకెళ్లేవాళ్ళు ఇండ్లకెళ్ళవచ్చు లేకపోతే స్కూల్లోనే కూడా పడుకోవచ్చు మళ్లీ ఉదయాన్నే 4.30కు ప్రారంభమయ్యే స్టడీఅవర్లకు నిద్రలేపతారు. ఇండ్లకెళ్లిన వాళ్లు ఆ టైంకి వచ్చేయాలి

ఒకమ్మాయి అంది.

"ఆ అయిదు గంటలు కూడా నిద్రరాదు సార్. చదువుతా వున్నట్టే వుంటుంది. ఉదయాన్నే నిద్ర లేవమేమో అన్న భయం నిద్రే పోనివ్వదు Parents లేపుతారనుకోండి."

ఇంత బీభత్సంగా యుద్ధం చేసినందువల్లే 100% పాసు, అయిదారుగురికి అయిదువందలూ దాటాయి. ఆ ఫలితాలు వచ్చిన రోజునైతే Maths చెప్పే రాజూసార్ ఆనందానికి పట్టపగ్గాలే లేకుండా పొయ్యాయి. ఆయన సబ్జెక్ట్‌లో Class average marks 78 అట!

నేను రాజూసార్‌ని చేతులు పట్టుకుని కాస్తదూరంగా పిలుచుకు వెళ్లి, "సార్! నేనీ స్కూళ్లకి కొత్త మీరేం అనుకోనంటే నాలుగు మాటలు మాట్లాడతా పిలకాయలకు తిండీతిప్పలు లేకుండా చేసి మీరిప్పుడేమి సాధించేశారని? ఇప్పుడు కొత్తగా 10th కు వచ్చిన వాళ్ళు - ముందు బ్యాచ్‌పడిన కష్టాలు తలుచుకొని బిత్తరపోతున్నారు. రోజుకు అయిదు గంటలు కూడా వాళ్లకు నిద్రలు లేకుండా చేశారట గదా. అసలు మీ గురించి వాళ్లేమంటున్నారో

తెలుసా? మీరు క్లాసుకొస్తే నాగుబాము క్లాసుకొచ్చినట్టేనట. అదెప్పుడు ఎవర్ని కాటేస్తుందో తెలియక చస్తుంటాం ఇంక లెక్కలెక్కడ వింటాంసార్ - అని చెప్పారు నాతో కొంచెం దయగా వుండండి. మహాఅయితే వొకరిద్దరు ఫెయిలవుతారేమో! Average marks 78 బదులు 68 వస్తాయేమో! అంతే గదా! ఈ విజయం కోసం పిల్లల్ని గానుగెద్దుల్ని చేసి వాళ్ల వుసురు పోసుకోవాలా? ఆరూ, ఏడూ, ఎనిమిదీ, తొమ్మిదీ తరగతుల్లో శుద్ధంగా లెక్కలు చెప్పి ఏడిస్తే - టెన్త్‌లో వాళ్లచేత వొక్కో ప్రాబ్లమ్‌ని ఇరవయ్యేసి సార్లు గుడ్డివాటంగా వెయ్యించాలంటారా..?" అని అడిగేశాను.

నిజం చెప్పొద్దూ! నా చేతిలో పెన్‌వొకటి వుందని ఇతరులంతా రాక్షసులూ, నేనొక్కణ్ణీ దయాళువూ అని చెప్పేసుకుంటే సరిపోతుందా?

రాజూసార్ చాలా మంచి మనిషి. ఆయన నోరు తెరిచాడు కృష్ణాజిల్లా యాసలో, "మాస్టారూ! ఈ education system అనేది వొక vicious circle ఇప్పట్లో గాంధీ మహాత్ముడే టెన్త్‌క్లాసు Maths చెప్తున్నాడనుకోండి. బెత్తంతో వీపు వాయగొట్టి రోజుకొకర్ని NIMS కు పంపేవాడు నేను డిగ్రీ ఫెయిల్ అయిన వాణ్ణి. నాలుగు స్కూళ్ళల్లో Maths చెప్పుకుని హాయిగా బతుకు తున్నాను.

మీరు పిల్లల్ని రక్తాలు కారేటట్టు కొట్టినా ఏ పేరెంటూ వొచ్చి గొడవ చెయ్యడు. ఒక్క పిల్లాడు ఫెయిల్ అయినా ఆ పేరెంట్ యుద్ధానికి వస్తాడు కాబట్టి తప్పదు. నేను కొంచెం జాలి తలచాననుకో పిల్లలు వర్క్ చేసుకుని రారు ఫెయిల్ అయిపోతారు ఈ స్కూల్లో టెన్త్‌లో ముగ్గురు ఫెయిల్ అయ్యారనుకోండి Maths లో రాజూసార్ లాభంలేదని కరస్పాండెంట్ సార్ రేపే నన్ను స్కూలికి రావద్దంటారు. ఇది మా బతుకు సార్" అనేసి అన్నాడు ఇంకేం మాట్లాడతాం!

20మంది పిల్లలు టెన్త్ చదువుతూంటే అయిదు మంది ఫెయిల్ అయ్యారనుకోండి. ఇక ఆ స్కూల్ బతకదు కాబట్టి నువ్వేం చేస్తావో తెలవదు. అందుకే 7th, 10th పిల్లల్ని పిండి పిప్పి చేసెయ్యడం!

తిరపతిలో ఇంకో స్కూల్లో ఇంకొక దారుణం జరిగింది.

అసలే టెన్త్‌క్లాస్, పైగా డిసెంబరు కూడా వచ్చేసింది. మార్చి పరీక్షలు తరుముకుని వస్తున్నాయి.

అయినా సురేష్ అనే పిలగాడు Maths లో ఏ ఫార్ములా అయినా సరే

చెప్పలేక బిత్తర చూపులు చూస్తున్నాడు. ఆ స్కూల్లో యజమానే టెన్త్ Maths చెప్తుంటాడు. సురేష్‌ని చూసి ఆయనకు టెన్షన్ పెరిగిపోయింది.

ఒకలెక్కను బోర్డుమీద వొకటికి రెండుసార్లు చేసి చూపించాడు. పిల్లవాణ్ణి చెయ్యమన్నాడు. వాడు బోర్డుమీద చెయ్యలేక పోయాడు.

అంతే సార్‌కి వొళ్లు పొగలుబోయింది. సురేష్‌ను చొక్కా విప్పమని వొట్టి వొళ్లు మీద రూళ్లకర్రతో పూజచేశాడు.

ఇంటికెళ్లిన సురేష్ అమ్మనూ నాయిన్నీ కూడా గుర్తుపట్టలేనట్టు బిత్తర చూపులూ పిచ్చి చూపులూ చూశాడు. వాడికి బాగవడానికి 20 రోజులు పట్టింది, అదీ డాక్టర్ల చుట్టూ తిప్పితే!

ఈ కథంతా ఆ స్కూల్ పారెంట్ అయిన వొకతల్లి నాకు చెప్పి,

"పిల్లల్ని ఆ మాదిరిగా పట్టించుకోబట్టే ప్రతీ ఇయరూ సెంట్ పర్సెంట్. ఒకరిద్దరికి 540 కూడా వస్తాయి."

ఈ ఖ్యాతి చాలదా! ఆ స్కూలాయన ఫార్ములాలు చెప్పకపోతే పిల్లల్ని గుండుగీసి గాడిదల మీద కూడా వూరేగించడానికి.

అడిగే నాధుడేడీ ?

# పిల్లల్లో సెక్స్ సమస్య: ఇదొక పెద్ద నల్లనాగుబాము

టీవీవొక నాగుబాము, సినిమా వొక నాగుబాము, వీటివల్లా నిలిచిన చోట నిలవనివ్వకుండా చేసే సెక్స్ వొక పెద్ద నల్లనాగుబాము.

ఈ chapter మొదలుబెట్టి వున్న పరువును కాస్తా చేజేతులా పోగొట్టుకునేటట్టుండాను కానీ తప్పదు. ఆమాటా ఈమాటా చెప్పి తప్పును సినిమా వాళ్లమీదా, పిలకాయలమీదా తోసేసి, మసిపూసి మారేడుకాయ చేసేసి నేనీ గండంనుంచి తప్పించుకోవచ్చు. మనుషులు మెచ్చినా దేవుడు మెచ్చడు గదా.

నా వీపు నేను చూసుకుంటా.

నేను ఆరో తరగతిలో వున్నప్పుడనుకుంటా - అడవిలోకి గొడ్లను తోలుకుపోయి కాల్లో తుమ్మముల్లు గుచ్చుకునేటట్టు చేసుకునేసినాను. అది దొంగముల్లు. పొట్టుగత్రతో తీసినా, ఉప్పురాయి పెట్టి కిరసనాయిలు చుక్క వేసినా రాలేదు. వారానికంతా కాలు కింద పెట్టలేనట్టు చీము పట్టిపోయింది.

మాయమ్మకు తప్పదు గదా. తిరప్తి రాయల్ చెరువురోడ్డులో బస్సు దిగినాం నన్నెత్తి చంకనేసుకుని ఆ జానాబిత్తెడు గువ్వ చంద్రశేఖరు డాక్టరు దగ్గిరికి తోడుకొని పోయి ముల్లు తీయించి చీము వొత్తేయించి కట్టు కట్టించింది.

డాక్టరు దగ్గిర్నించి బైటికి వొచ్చినామో లేదో 'సిల్మా సిల్మా' అని మా అమ్మను ఉప్పున బెట్టి పప్పున పామేసినా. ఇంటికాడ గొడ్డూగోదను, చట్టీకుండను ఎక్కడికక్కడ వొదిలేసి వొచ్చుంటుంది గదా వొద్దనే వొద్దని పుల్ల విరిచి నేలేసేసి నాకొక బన్నురొట్టి తీసిచ్చింది. మళ్లీ ఏడిస్తే దాన్ని అద్దుకోని అద్దుకోని తినేదానికొక టీ తీసిచ్చింది. సిల్మా మాత్రం కుదర్లా.

సిల్మా వొద్దన్నందుకు మా అమ్మకు నేనేసిన శిక్ష ఏమంటే - నన్నెత్తుకుని తిరప్తిలో నాలుగు వీధులు తిరగాలి, నేరుగా బస్సు ఎక్కేయ్యకుండా నాలుగు వీధుల్లో పది వాల్‌పోస్టర్లుంటాయి గదా. బొమ్మలు చూడొచ్చు గదా

అంతే, మా అమ్మకు తప్పలేదు. నన్ను నాలుగు వీధులూ తిప్పింది వాల్‌పోస్టరు కాడ వొక్కోదాని కాడ అయిదు నిమిషాలు నిలపెట్టి దాంట్లో వుండేదంతా చూసి, చదివి 'ఇంక పద' అనేవాణ్ణి

అదీ సినిమా పిచ్చి అంటే.

చిన్నప్పుడు టవునులో కాపరాలు వుండేవాళ్లు అన్నాలే చేసుకోని తినాల్సిన పన్లేదు. మార్నింగ్‌షో, మ్యాట్నీ, ఫస్ట్‌షో, సెకండ్‌షో - ఇట్లా సినిమాలు చూసే స్తావుంటే చాలు గదా అనుకునే వాణ్ణి. నేనైతే నాలుగైదు రోజులు వరసగా సినిమాలు చూస్తా అన్ని నీళ్లు తాగేసి గమ్మనుండి పోతాను అనేది నా సిద్ధాంతంగా వుండేది.

ఏడో తరగతిలో వుండగా అనుకుంటా - మా వూరికి మూడు మైళ్ల దూరాన వుండే వెంకటాపురంలో టెంటు పడింది దాంట్లో చూసినాను - మొదటిసారిగా జ్యోతిలక్ష్మి పాట.

జ్యోతిలక్ష్మి మా పిలకాయలని ఎట్లా ఏడిపించి చంపిందో ఈ రకం చచ్చుపుచ్చు మాటలతో చెప్పలేను గానీ మా వూర్లో ఇలామంతు బావ సహాయం తీసుకుంటా

వెంకటాపురంలో సినిమా చూసేసి అర్ధరాత్రి పూట మావూరు తిరిగొస్తా వుంటే ఆయనొకసారి ఇట్లా అన్నాడు "జ్యోతిలచ్చిమే లేకపోతే - మీ పిలకాయల గెలకు నీళ్లే దిగవురా. మీకు పెండ్లిండ్లే చెయ్యాల్సిన పన్లా."

ఇంతకంటే మాటా జ్యోతిలక్ష్మి మీద!

డిగ్రీ దాటుకున్నానో లేదో నాకు సినిమాల మీద పిచ్చి ఎట్లపోయిందో పోయింది. ఇప్పుడైతే అవంటేనే వికారం కూడా

కానీ ఒకమాట మాత్రం చెప్పగలను - అప్పట్లో నా నిద్ర చెడగొట్టింది జ్యోతిలక్ష్మి, జయమాలిని, సిల్క్‌స్మిత, జయప్రద, జయసుధ. ఇట్లా వేళ్లమీద లెక్కేసుకోవచ్చు.

ఇప్పుడు పిలకాయలు లెక్కెయ్యాల్సివస్తే తల వెంట్రుకలు కూడా చాలవు. ఈ మాట నేనెట్లా చెప్పగలనంటే-

రెండేండ్లకు ముందు దాకా నాకు టీవీ అంటేనే తెలవదు అప్పటికి మహా అయితే 3,4 గంటలు నేను టీవీ చూసి వుండొచ్చు నా జీవితంలో.

మా పిలకాయలు పెద్దవుతున్న కొద్దీ టీవీ తెమ్మని ఒకేపోరు. సంసారం చేసుకునే ఇంటికి అదొస్తే పిలకాయలు చెడిపోతారని నేను వాయిదా వేసుకుంటూ వొచ్చినాను. మేం హైద్రాబాద్‌లో వున్నప్పుడు మా ముగ్గురు పిలకాయలకూ కాలు ఇంట్లో నిలిచేదే కాదు. ఎప్పుడూ పక్కింట్లోనే. రాత్రిపూట వాళ్ళు తలుపులేసుకున్నా తట్టడం, మేం తిడతామని భయపడితే తలుపు సందుల్లో కళ్ళు పెట్టి టీవీ చూసేద్దామన్నంత ఇది... పాపం మా పక్కింటివాళ్ళు టీవీ చూసేప్పుడు మా పిలకాయల్ని ఏమీ అనకపోయినా, వాళ్ళు ఏదో అనేస్తున్నారని మాకిక్కడ అనుమానం

"మేం అంత గతిలేకుండా ఏం బతకడంలేదు!" అని కేవలం పక్కింటివాళ్ళ మీద శౌర్యంతో మేం instalments మీద టీవీ తెచ్చేశాం. పైగా ఏక్‌దమ్మున పదివేలూ డబ్బు కట్టేసి తెచ్చినట్టు పక్కింటి వాళ్లకు తెలిసేటట్లు ప్లానుచేసి టీవీ బిగించాం.

ఇప్పుడు ఈ టీవీ చూపించిన ప్రభావం గురించి·

ఇది మా ఇంటికొచ్చిన మూడు నెలలకే మా టాంసాయర్ నా చొక్కాయ పట్టుకుని లాగి, "నాన్నా! Ozomen ఎందుకు వాడతారు?" అని గాభరాగా అడిగినాడు.

ఈ మాటకు నా కూతురికి నవ్వు పొడుచుకుని వస్తావుంది. ధైర్యంగా నవ్వితే వాళ్లమ్మ తిడుతుందని భయపడి ఆపుకుంటూ వుంది మావాడి ప్రశ్నకు నేను బిత్తర నటించక టకీమని, "తలకాయ నెప్పికి వాడతార్రా నాయినా!" అన్నాను.

"నీ మొఖం! love పెరగడానికి వాడతారు!" అనేసి అన్నాడు వాడు.

పసిబిడ్డమీద అబద్ధాలు చెప్పకూడదు. టీవీ మీద ఇంతకంటే ఏం చెప్పుకుందాం ఇంక!

ఈ టీవీ అనేది నాకు కొత్త కానీ దాంట్లో అటువంటివి వస్తాయని కలనైనా అనుకోలేదు. ఒకరోజు రాత్రి నిద్రపట్టక ఛానల్స్ మారస్తా వుంటే కొందురు యుక్తవయసులో వున్న ఆడపిలకాయలు రిబ్బనుమాదిరిగా నడుంకు చుట్టుకుని గుంపులు గుంపులుగా వస్తూ వుండినారు అది Fashion TV అంట. దాన్ని నేను ఈ రెండేండ్లలో కనీసం 50 సార్లు అరేసి గంట చూసివుంటా

ఇంక AXN అని ఏదోఒకటి వుంది. నేను ఇంగ్లీషు సినిమాలు చార్లీచాప్లిన్ సినిమా వొకటి తప్ప (అదీ దాంట్లో మాటలు వుండవని తెలిసి) మిగతా ఏదీ చూళ్లేదు. నాకు అవి అర్థంకావు. ఎప్పుడు మాట్లాడుకుంటారో, ఎప్పుడు

టుపాకుల్తో పేల్చుకుంటారో తెలవకుండా వుంటాయవి. ఎందుకో ఒకరోజు AXN పెట్టుకున్నా. నిమిషంలో 2 నిమిషాల ముద్దు సీను కనిపించింది సౌండు తగ్గించేసి దాన్నే చూసినా. ఇప్పుడీ రెండేండ్లల్లో కనీసం వందసార్లు ఆ ముద్దుసీన్ల కోసం ఆ ఛానల్ చూసివుంటా.

ఇంక తేజ టీవీలో రాత్రయితే పాటలు వస్తావుంటాయి అందులో వేసినవే వేస్తావుంటారు

సిగ్గువిడిచి - దాంట్లో మాటిమాటికీ వచ్చే వొక పాట గురించి చెప్తా.

అది వానపాట. సినిమా ఏదో నాకు తెలవదు ఒకసారి దాంట్లోని సాహిత్యాన్ని కూడా విన్నాను. 'ఓ ఇది ఏమి మాయ...' అనుకుంటాను చిరంజీవి, వాణీ విశ్వనాథ్ వుంటారు దాంట్లో.

ఆ పాటను వర్ణించాలంటే పైకి బడాయిగా కోపంతో వొళ్లు పొగలు బోతుంది అని చెప్పవచ్చు. కానీ ఆ పాటను తలుచుకుంటేనే వొళ్లంతా ఒకరకం మైకం, జిల... అట్లా వుంటుందా పాట.

వానకు తడిసి ముద్దముద్దగా వెల్లికిలా పడిపోతుంది వాణీవిశ్వనాథ్ అప్పుడు చిరంజీవి - ఆమె రెండు తొడలమధ్య సైకిల్ ముందరి చక్రాన్ని ఎక్కిస్తాడు, ఇట్లా వుంటుంది.

నాకిప్పుడు 40 ఏళ్లు. ఆ పాట చూడగానే ప్రభావతి కోసం నేను వెతుక్కోవాల్సిందే.

ఈ రెండేళ్లలో కనీసం ఆ పాటను పదిసార్లయినా చూసుంటా, ఆ పదిసార్లూ ప్రభావతిలో వాణీవిశ్వనాథ్‌ను చూసుకుని వుంటా. ఇంక చాలా!

ఇట్లాంటి నగ్మాపాటలూ, విజయశాంతి పాటలూ ఎన్నో చెప్పలేం.

వాటిని చూసి నాకే ఇప్పుడు వాణీవిశ్వనాథ్ కావాలని వుంటే - మంచి 15, 16 ఏళ్ల పిలకాయలు ఏమైపొయ్యేది!

పోనీ వాటిని పిలకాయలు చూడరు అనేదానికి వుందా?

లోపల ఒక రూములో తలుపేసి EAMCET prepare అవుతుంటాడొక పిలగాడు. కాస్త బోరుకొట్టి టీవీ ఆన్ చేస్తాడు. రెండు నిమిషాలు వాణీ విశ్వనాథ్‌ను చూడడం అనేది ఎట్లా కుదరకుండా పోతుంది? అది చూసేశాక వాడికి వాణీవిశ్వనాథ్‌ను ఎవరు తెచ్చిస్తారు! ఆ సమయంలో Physics text book నాలిగ్గీసుకోడానికా!

టీవీని అట్లా ఆన్ చేసినా, బజారుకెళ్లి ఏదో వొక సినిమాకు పోయి వచ్చినా - పిలకాయల వొళ్లు హూనం అయిపోయే పరిస్థితి సెక్స్ కోరికలతో.

టీవీల్లో అప్పుడప్పుడూ - సినిమాల్లో కొన్ని సన్నివేశాల్ని బిట్స్ బిట్స్‌గా వేస్తుంటారు

అందులో భాగంగా వొచ్చే వొక బిట్ తల్లీ ఇద్దురు కూతుళ్లూ ఒక రూములో వుంటారు. చిరంజీవి లోపలికెళ్తాడు. అయిదు నిమిషాలు అంతా చీకటై పోతుంది. చిరంజీవి వొళ్లు విరుచుకుంటూ వొస్తాడు ఆ ముగ్గురిలో వొకరికి పనైపోయి వుంటుంది. అది అత్తకు!

సంప్రదాయము, బొచ్చు, బోదకసువు అని మన పెద్దవాళ్లు భలే మాట్లాడతా వుంటారు బయట. పిల్లనిచ్చిన అత్త అంటే మనకు తల్లితో సమానం. కానీ తెరమీద ఇట్లా.

ఇప్పుడు సమాజంలో పిల్లలకు తప్ప - పెద్దలెవరికీ పెద్దలంటే భయంలేదు. చిన్నా పెద్దా అనేదేలేదు. నీకునువ్వే king నాకు నేనే king. ఎవరు కానిపని చేసినా ఎవరికెవరూ interfere కారు

ఇంత చెప్పే నేను - రేపు నా కొడుకు చిరంజీవి అంతటి వాడైతే విర్రవీగి పోనా!

అన్నింటికీ తలుపులు ఎత్తేశాం.

ఒక ఛానెల్లో ఉదయభాను - ఎక్కణ్ణుంచి వస్తుందో ఆమెకంత నవ్వు - ఎద ఎగిరెగిరి పడుతుండగా ఓ అని నవ్వేస్తూ వుంటుంది. ఇంకో ఛానెల్‌లో వాణీవిశ్వనాధ్ వానపాట వస్తావుంటుంది. మరొక ఛానెల్లో - హీరోలు అత్తల్తో సహా హీరోయిన్లందరి పనీ పట్టేసి వొళ్లు విరుచుకుంటూ వుంటారు.

ఇవేమీ పట్టనట్టు మన పిలకాయలు మాత్రం తలుపులేసుకుని Maths లో, Physics లో, Chemistry లో వున్న లోతుల్ని ఎంచక్కా అర్థం చేసు కుంటూ EAMCET లో ర్యాంకులు తెచ్చేసుకుంటూ ఇంజనీర్లయిపోయి మననెత్తిన కిరీటాలు పెట్టేస్తూవుండాలి

ఆహా, ఏమి లోక న్యాయం!

# కోళ్లఫారం పెట్టినట్టే....!

నేను గొంతు చించుకునే ముందు చిన్న కథ Arabian Nights లోది నాలుగో తరగతి ఇంగ్లీషు text book లో వుండబట్టి నాకు తెలిసింది కథ పేరు The False School Master.

చిన్నపేటలో వొకడుంటాడు డబ్బు సంపాయించే మార్గం ఏదబ్బా అని చిటికేసినంతసేపు ఆలోచించి వొక స్కూలు పెట్టేయాలనుకుంటాడు నాలుగు బెంచీలూ, నాలుగు పుస్తకాలూ, అన్ని పెన్సిళ్లూ, వొక గ్లోబూ కొనుక్కునేసి వొక బోర్డు తగిలించేసి స్కూలు పెట్టేస్తాడు.

వాడికి చదవను రాదు రాయను రాదు. కానీ స్కూలు చూద్దుమా జెమ్మా చారంగా వుంది, సార్ కూడా గుడ్డా గుసురూ బాగానే కట్టుకుని ఫ్యాషనుగా వుండాడు. ఇంకేం? తల్లిదండ్రులంతా పిలకాయల్ని ఆ స్కూల్లో చేర్చేసినారు

ప్రిన్సిపాలు సారు మంచి తెలివైనోడు. చదవను తెలవకపోతే ఏమి, రాయను తెలవకపోతే ఏమి? పిలకాయలు వాళ్లంతట వాళ్లే చదువుకుంటార్లే అని పుస్తకాలిచ్చేసి అది చదవండీ, ఇది రాయండీ అని జబర్దస్తీ చేస్తా రోజులు గడపతా వుండినాడు. పిలకాయలు కూడా నిజంగానే వొకర్నుంచొకరు రాస్డీ పోస్డీ నేర్చుకుంటూ వుండిపోయినారు

ఒకరోజు స్కూలు ముందర సార్ కుర్చీ యేసుకోని నిగడదన్నుకొని కూర్చోని వుండాడు ఒకామె చేతిలో ఏదో కాగితం పట్టుకుని స్కూలుకల్లా వస్తా వుండింది సార్ గుండికాయలు నీళ్లయిపోయినాయి. 'ఈ ముండ ఆ కాగితాన్ని చేతల్లోబెట్టి చదవమనునా ఏమి' అని బిత్తర బిత్తరగా వుండంగానే ఆమె వొచ్చేసింది. కాగితాన్ని చేతిలో బెట్టి 'చదివి చెప్పుసా' అనడిగింది.

'అయ్యో, ఇప్పుడనగానే వొస్తివా తల్లీ! నాకు ప్రేయరుకు టైమవతా వుందే' అని తప్పించుకోబోయినాడు గానీ కుదర్లా.

కాగితాన్ని తిరగేసి మరగేసి చదివినట్టు యాక్షను జేసి మూతినల్లంగా పెట్టుకున్నాడు. సార్ దిగులుగా పెదాలు చప్పరించడం, మూతి మూరడు

పొడుగు పెట్టడం చూసి, "ఏం సా నామొగుడేమన్నా చచ్చిగాని పోయినాడా?" అని ఏడ్చింది పిచ్చిది.

అవునన్నట్టు తలకాయ వూగించినాడు సారు

ఏడ్చుకుంటా ఇంటికి పోయిందామె ఇరుగుపొరుగు చేరి, "స్కూలికి నవ్వతా నవ్వతా పోతివి. ఇంటికి ఏడస్తా ఏడస్తా వొస్తివి. ఏం తల్లా సంగతి!" అని అడగబట్టిరి.

"నా మొగుడు చచ్చిపోయినాడంట. ఇస్కూలు చెప్పే సారు చెప్పినాడు." అని చేతిలో వుండే కాగితం చూపించింది.

గుంపులోనుంచి వొక పాలూకూడూ తినే ఆయన, "అయ్యో నాకు నిన్ననే లెటరొచ్చిందే ఆయన 10 రోజుల్లో తిరగొస్తాడే!" అని ఆ కాగితాన్ని తీసుకుని చూస్తే - ఇంటి ఖర్చులకు డబ్బు కూడా పంపినట్టు దాంట్లో వుండింది. ఆమె మొగుడు పొట్టేలు పిల్ల మాదిరిగా బాగుండాడంట. అప్పుడు నిమ్మళాని కొచ్చిందామె.

ఇస్కూలికి పోయి, "ఏం సా, అనావశంగా నా మొగుణ్ణి చంపకతింటివే!" అని ఆమె అడిగితే, ఏముందీ-

"మొత్తానికి నీ మొగుడు సౌఖ్యమే గదా. పోనీలే పాపం" అని సార్ తల వాలేసుకున్నాడు

Arabian Nights ఏ కాలంనాటివో నాకు తెలియదు. కానీ ఈ కాలం స్కూళ్లక్కూడా ఇది అచ్చుగుద్దినట్టు సరిపొయ్యే కథ. ఇంకేం చెప్పేపన్లేదు గానీ నా పాత్ర నేను పోషించొద్దా!

కోళ్లఫారాలు పెట్టినట్టు పెట్టేస్తున్నారు స్కూళ్లని కూడా.

నిజంగానే.

మొన్నటికి మొన్న ఈ పాపం చేసిన చెవుల్తో ఇట్లా విన్నాను.

"ఒక షెడ్డేసి రెండువేల పిల్లల్తో బ్రాయిలర్స్ పెట్టేశాను మనకింకా అరవై అంకణాలుంది దాంట్లో కూడా షెడ్డేసి స్కూలు పెట్టేశాను. ఏక్‌దమ్మున 200 మంది పిల్లలు చేరిపోయారు."

నేను ఆశ్చర్యపోయాను ఈ మనిషిని చూసి, కొత్తగా సెవెన్త్ వరకూ పెట్టిన స్కూల్లో 200 మంది పిల్లలు ఎట్లా చేరిపోయారా? అని.

ఆయన చెప్పినాడు

"భలే ఐడియా వేశాన్లెండి L.K.G., U.K.G., ఫిఫ్టీ రూపీస్ 1st to 7th

హండ్రెడ్ రుపీస్ ఫీజు అంతే ముందు అట్లాగే పెట్టాలి షెడ్ బాగుంది, మద్రాసుదాకా పోయి 5వేలు పెట్టి టాయ్స్ అవీ కొనుక్కొచ్చాను. చేరి పోయారు "

అయనేం అబద్ధాలు చెప్పలేదు. కోళ్లకెంత సౌకర్యంగా షెడ్ వేశాడో పిల్లలకూ అంతే సౌకర్యంగా షెడ్ వేశాడు. సత్యప్రమాణం గానే అయన strength-200 మంది పిల్లలు! (రెండు వేల బ్రాయిలర్స్ కాక!)

అంత ఈజీ స్కూలు పెట్టడం!

నాకు తెలిసినంత వరకూ ఆయనకు Hero Honda నడపడం, కళ్లకు Rayban గ్లాసులు పెట్టడం తప్ప మరొక విద్య రాదు

నేనెంత కుళ్లి చచ్చానంటే-

నేను ఈ సంవత్సరం జూన్ 15 కల్లా హైద్రాబాద్ నుంచి తిరప్తి వొచ్చేశాను ఈ సంవత్సరం Academic year ప్రారంభమై పోయింది గాబట్టి స్కూలు పెట్టలేం, వొచ్చే సంవత్సరం ఎట్లాగైనా స్కూలు పెట్టేయాలనేది నా ఆశ

ఈలోగా నా talent కాసింతయినా బైరాగిపట్టెడ ప్రజలకు చూపించి నా పెళ్లాం బిడ్డల్ని సాక్కోవాలని ప్లాను వేసి ఇంట్లోనే tutions చెప్పుకుందామని చూశా. చివరకు ఇద్దరు ముగ్గురు పిల్లలు ఇంటికొచ్చి అదీ ఇదీ చెప్పించుకుని పోతున్నారు.

Tomsawyer Tution Centre లేదా Deepthi Tution Centre అని బోర్డురాసి వేలాడదీయ లేదని నా దగ్గరకు పిల్లలు రాలేదంటారా? 5, 6 వేలు ఖర్చు పెట్టి వొక పెద్ద ఇల్లు తీసుకుని అట్లా కూడా వొక బోర్డు వేలాడదీసే వాణ్ణే! అదీ ఎందుకు మానుకున్నానంటే -

స్కూల్లో పిల్లలకు తీరికేదీ, నా దగ్గరకు tution కు రావడానికి!

స్కూల్ hours అయిపోగానే అదే స్కూల్లో tution start అయిపోతుంటే-

తప్పేదరీ ఇద్దరు పిల్లలు మన దగ్గిర చేరారే అనుకోండి వాళ్లని అక్కడి సార్లు చంపుకు తింటారు.

"ఎవడ్రా నీకీ లెక్క చెప్పిందీ! పనికిమాలిన వాళ్లందరి దగ్గరా tution చేరేదీ మమ్మల్ని చావదొబ్బేది! tution ఇక్కడే చేరూ!" అని తాట వొలుస్తారు.

ఇదికాదు మంత్రం అని చెప్పి 20, 25 మంది parents ను కలిసి "చూడండి మీ పిల్లవాడు సెవెన్త్ చదువుతున్నాడనుకోండి. సెవెన్త్ పుస్తకంలోవే చెప్తే రావు. వాడికి అంకెల్లో divisions మీద స్పష్టమైన అవగాహన లేనప్పుడు Algebra

లో divisions ఎలా చెప్తాం చెప్పండి! మీరు వోపిగ్గా ఉంటే fundamentals neat గా చెప్పించి 8th కు వచ్చేలోగా వాడికి లెక్కలంటే ఆసక్తి కలిగిస్తా మీరు నాకు tution fees కూడా ఏమీ ఇవ్వనవసరం లేదు." అనేసి అన్నా.

ఈ last మాట నేనెందుకు ప్రయోగించానంటే తెలివి తక్కువై కాదూ, వాళ్లకు సేవ చేసేద్దామనీ కాదు. ఇట్లా ఉచితం అనే మంత్రానికి చక్కలిగింతలు మొదలై parents మా ఇంటికి తెల్లారిపూట 30 మంది పిల్లల్నీ, సాయంత్రం పూట 30మంది పిల్లల్నీ tution కు పంపించారనుకోండి. నా strength 60 మంది అవుతారు కదా. Next year కంతా తల్లిదండ్రుల్నీ, ఈ పిల్లల్నీ line లో పెట్టుకుని - మా నామినీ సార్ King అనిపించుకుంటా. అంతే, ఈ 60 మంది పిల్లల్నీ లడ్డులాగా నేను next year పెట్టబోయే స్కూల్లో join చేసేసుకుంటా. స్కూలు రిజిష్టరు తెరవగానే 60 పేర్లు ఎక్కిపోతాయి గదా.

మొత్తానికి నాది నక్క తెలివే అయ్యింది క్లిక్ అవలా

దాదాపుగా ఏ పిల్లవాణ్ణీ స్కూలు వాడు వేరేచోట tution చేరనివ్వడు గాక చేరనివ్వడు!

ఇంక నేను స్కూలు పెట్టేమాట. కొత్త బిచ్చగాడు పొద్దెరగడు అనే సామెత వుండనే వుంది గదా! స్కూలు ఏ area లో పెడితే బాగుంటుంది అని సర్వే చేసి తిరుపతి తుమ్మలగుంటను ఆనుకుని వుండే నలందానగర్ అని నిర్ణయించా నలందానగర్‌లో పెద్ద పెద్ద ఇళ్లు మామూలుగా ఇళ్లు, స్కూళ్లు పెట్టుకోవడానికి అనువుగా కట్టరు గదా పైగా అద్దె కనీసం 5 వేలు అమ్మో కుదరదులే అని నోరుంది గదా అని site బేరం చేశా ఒక చిన్న స్కూలు పెట్టడానికి కనీసం 100 అంకణాలు కావాలి. అక్కడ వంద అంకణాల బిట్ వుంది కూడా వంద అంకణాలూ 5 లక్షలవుతుంది.

సైట్‌కు అయిదు లక్షలు!

ఇక రేకుల షెడ్లు వేశామనుకోండి. second hand రేకులూ, పైపులూ తీసి వేసినా రెండు లక్షలవుతుంది! ఇక ఫర్నీచరు, school recognition కూ లక్ష అనుకుందాం!

8 లక్షల పెట్టుబడి వుంటే 150 మంది పిల్లలు చేరే వీలు వుండొచ్చు ఆ తర్వాత ఒక వ్యాను పెట్టుకుంటే .!

నేను తోక ముడిచేశా అగో, ఆరునెలలుగా ఈ పుస్తకం మీద కష్ట పడుతున్నా.

ఇదంతా ఎందుకు చెప్పుకొస్తున్నానంటే - స్కూళ్ళు పెట్టడం అనేది కొందరికి మంచి నీళ్ల ప్రాయం!

అదీ ఎట్లాంటి వాళ్లకి!

సొంత site వుండే వాళ్లూ, పది లక్షలయినా ఏమయిందిలే అనుకునే వాళ్లకూ ఇది నీళ్లు తాగినంత సులువు!

స్కూళ్లమీద ఇప్పుడు ఎందుకింత వేలం వెర్రి వుందంటే అందులో కనిపించే ఆదాయాలూ అట్లాగే వున్నాయి. నేను పేర్లు చెప్పి ప్రాణాలు పోగొట్టుకోలేక ప్రతిదీ ఎంత పేలవంగా చెప్తున్నానో.....

ఈ మధ్య సర్పంచ్ ఎన్నికలు జరిగాయి గదా! ఎంతమంది సర్పంచులు - స్కూళ్ళు పెట్టుకున్న వాళ్లు అయ్యారో సర్వే చేసుకోండి రాష్ట్రం మొత్తంమీద మీకే తెలుస్తుంది!

నాకు తెలిసి ముగ్గురు స్కూలు వాళ్లు సర్పంచులయ్యారు

ఒక్కరేమో నాలుగులక్షలే ఖర్చు పెట్టి వేలంపాట పాడేసి స్వంత వూరికి యునానిమస్‌గా ఎలెక్ట్ అయిపోయాడంట మిగతా ఇద్దరూ ఖర్చు పెట్టింది 15 లక్షల పైమాటే! ఇద్దరూ కలిసి కాదు తండ్రీ ఒక్కొరు 15 లక్షలు ఖర్చు పెట్టి గెలిచారు!

ఆ ఇద్దరి (కరస్పాండెంట్లు) strength చెరి వెయ్యి మంది పిల్లలు!

వంద అంకణాల్లో loan లు పెట్టి కట్టిన బిల్డింగులే! లోన్‌లు ఎప్పుడో ఎగిరిపొయ్యాయి ఇద్దరికీ కూడా

స్కూళ్లు పెట్టిన వాళ్లకు ఆ డబ్బు ఏం చెయ్యాలో తెలియని పరిస్థితి! తీరా రాజకీయాల్లోకి కూడా దిగేయడం

"వెయ్యిమంది strength వుంటే మాత్రం 15, 20 లక్షలు ఎట్లా ఎన్నికల్లో పెడతారు సార్! వొకవేళ అది పోతే వాళ్లకు బతుకా?" అనేసి బిత్తరపోయాన్నే నొకాయన్తో, ఆయనకీ చిన్న స్కూలు వుంది పుత్తూరులో.

ఆయన నవ్వి, "వెయ్యిమంది strength అంటే 2 వేల మంది strength అని అర్థం! ఏమనుకుంటున్నారు? దోసెను తిరగేసి కూడా కాల్చుతాం కదా!" అన్నాడు.

నాకు నిజంగా అర్థంకాలా

ఆయన మర్మం చెప్పాడు

"ఒక్క పిల్లాడంటే ఇద్దరని అర్థం. స్కూలుకొచ్చిన గాడిద ట్యూషన్‌కు కూడా వస్తాడు గదా.. ఇద్దరవలా? స్కూలు ఫీజు 300 అనుకోండి ట్యూషన్

ఫీజు 150 అంతేనా? బిల్డింగు ఫీజులూ, పుస్తకాలూ, వర్క్ బుక్కులూ, నోట్సులూ, కంప్యూటర్ ఫీజులూ - చివరకు అదే స్కూల్లో యూనిఫాం కుట్టడానికి టైలర్లు కూడా! 150 మంది పిల్లల్తో నడిచే షెడ్ కూడా 3 అంతస్తుల బిల్డింగ్ అయిపోతుంది. అన్నీ లోన్లే. అన్నీ తీరిపోతాయి కూడా "

సారాంశం ఇదీ.

భూమిని నమ్ముకున్న రైతు చెడడం, పిల్లల్ని నమ్ముకున్న స్కూలు వాడు బాగుపడిపోవడం ఖాయం !

ఇప్పుడు స్కూళ్లు పెట్టేవాళ్లకీ, అప్పుడే స్కూలు పెట్టిన మన false school master కీ ఒక పెద్ద తేడా వుంది. False school master పుణ్యాత్ముడు.

ఆయనెంత పుణ్యాత్ముడంటే - పిల్లల మీద ఆయనకు చాలా నమ్మకం కాబట్టే పిల్లల నెత్తిమీదికి నలుగురు టీచర్లను తెచ్చి తొయ్యలేదు "He knew that children can learn from each other."

వీళ్లెంత రాక్షసులంటే - parents మెరమెచ్చులకోసం అన్నట్టు subject కొక టీచర్‌ను వేసి బెత్తం చేతికిస్తారు!

తేడా అల్లా ఇదే!

# మేధావుల పిల్లచేష్ట

చింతకాయలమ్మే దానికి సిరొస్తే పట్టపగ్గాలుండవు మొన్నటిదాకా వాటిని అమ్మి పొట్టబోసుకున్న సంగతి మర్చిపోయి, ఆ వొంకరటింకర కాయలేందమ్మా అట్లా వున్నాయని అడుగుతుంది

మేధావులు గదా సిలబస్‌ను రూపొందిస్తారు దున్నపోతుకు ఒక పిల్లాడు ఎదురొచ్చాడనుకుందాం. పాపం ఈ కొమ్ముల్తో ఆ పసి బిడ్డను పొడవాలా ఛా వొద్దు అనేసి అది తొలగేసుకుని పోతుంది. ఈపాటి జ్ఞానం కూడా మేధావులకు వుండదు

పసిపిల్లల మీద వీళ్లు ఎంత ప్రతాపం చూపిస్తారో చూడండి

పదో తరగతి text books అన్నీ ముందరేసుకుని చూశాను. కొన్ని books A4 సైజులో చాటడేసి ఉన్నాయి. వాటిని కూడా మామూలు Text book size ప్రకారం లెక్కేస్తే 3504 పేజీలు లెక్క తేలాయి.

3500 పేజీల సిలబస్ జీర్ణం చేసుకునే దానికా ! కక్కేసే దానికా ?

వీళ్లు మాత్రం రాత్రిపూట రెండంటే రెండే పుల్కాలుతిని, వొక గ్లాసుడు మజ్జిగ తాగి ఆరోగ్యాన్ని అంత జాగ్రత్తగా కాపాడుకుంటారే!

పిల్లలకు మితమైన చదువు ఇవ్వాలని తెలీదా!

ఒక స్కూలు ముందు బీటు కానిస్టేబుల్ మాదిరిగా తిరుగుతుంటే వొక దారుణం కంటపడింది. 55మంది పిల్లలున్న టెన్త్ క్లాసులోనుంచి 15మంది పిల్లలు గోలగోలగా ఏడ్చుకుంటూ ప్రిన్సిపాల్ రూములోకి వెళ్తున్నారు.

వాళ్లని తెలుగు టీచరు తరిమేశాడు. కారణం - పది రోజులైనా ఈ శుద్ధమొద్దులు వొక పద్యానికి కూడా ప్రతి పదార్థం చెప్పలేకపోతున్నారు కంఠతా పెట్టి.

ఆ పద్యం ఇదీ·

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని ద్వితీయాశ్వాసంలోది

Gaps తో సహా అచ్చుపుస్తకంలో ఎట్లావున్నదో అట్లాగే ఇక్కడ రాస్తున్నాను.

తలమే బ్రహ్మకు నైన నీనగమహత్త్వం బెన్న? నేనియ్యెడన్
గలచోద్యంబులు తేపు గన్గొనియెదన్ గాకేమి, నేడేగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూ త్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్ దెల్పెడిన్

ఈ పద్యాన్ని 20 సార్లు రాసుకు రమ్మని చెప్పి హోంవర్కు ఇచ్చినా, ఫలితం కనబళ్లా!

ఒక పద్యంమీద ఇన్ని రోజులా? అని చెప్పి తెలుగు అయ్యవారు స్కేలునొకదాన్ని తీసుకుని ఈ 15 మంది పిల్లల అరిచేతుల్ని తిరగెయ్యమని చెడామడా కొట్టేసి వుండాడు.

పిల్లలు మంటపుట్టి ఏడ్చేస్తున్నారు. ఈ శిక్ష చాలక తెలుగు అయ్యవారు - ఈ ముండల్ని మీరు కూడా దంచండి అని చెప్పి పెద్దసారు - ప్రిన్సిపాలు రూంకి పంపించినాడు

పై పద్యంలో రెంటిమూటికి తప్ప మిగతా వేటికీ అర్థాలు తెలియవు.

అది, text book లో స్టార్‌ఉన్న పద్యం గనుక పద్యమూ నేర్చుకోవాలి, ప్రతి పదార్థమూ నేర్చుకోవాలి. ఇట్లా విధిగా నేర్చేసుకోవాల్సిన పద్యాలు 10, 12 అయినా వుండవా!

ఈ ఒక్క పాఠంలోనే స్టార్ వున్న పద్యాలు మూడున్నాయి.

నేను గ్యారంటీ ఇవ్వగలను కూడికూడి చదవగలమేగానీ మనలో 99 మందికి అర్థం తెలిసే ప్రసక్తే లేదు.

పదో తరగతిలోగా చదివే చదువును ప్రాధమిక విద్య అని అంటారు మహా అయితే ప్రాధమికోన్నత విద్య!

చరిత్ర నుంచి పాఠాలు నేర్చుకోవాలని పెద్దలు అంటూవుంటారు. అశోకుడిదే గాదు చరిత్ర. నాదీ, నీదీ కూడా చరిత్రే.

రాష్ట్రవ్యాప్తంగా ఒక physics professor నీ, ఒక chemistry professor నీ ఇట్లా 25 మందిని తీసుకుని తెలుగు పుస్తకంలో వుండే 10 పద్యాలను ఇచ్చి ప్రతిపదార్థం రాయమనండి. అత్వసంధి, ఇత్వసంధి, టుగాగమ సంధి - లక్షణాలు చెప్పమనండి.

అయ్యో ప్రొఫెసర్లకు ఇదేమి టెస్ట్ పాపం అనిపిస్తుంది. మరి అందరూ ప్రాధమిక విద్యను పూర్తిచేసి ఉన్నతవిద్యను అభ్యసించిన వారే గదా!

ఇదీ చరిత్ర! దీనినుంచి మనం ఏమైనా నేర్చుకుని ప్రాధమిక విద్యలో

ఇంత చేర్చడం అనవసరం కంఠస్తం పెట్టినా ఏదీ గుర్తుండి చావదు. ఎందుకు వృథా ప్రయాస - అనుకున్నామా?

పదో తరగతి చదివే పిల్లలకు - తెలుగు చదవడం, చక్కగా రాయడం ప్రాక్టీసు చేయిస్తే చాల్లే! మర్యాద కోసం సంధులూ సమాసాల్తో వారినెందుకు చంపుకు తినడం అని ఈ భారాన్ని తగ్గించామా!

English కూడా ఇంతే. కనీసం parts of speech చెప్పించరు, tenses చెప్పించరు, sentence construction చెప్పించరు

Text book అని వొక్కటీ, సప్లిమెంటరీలని రెండూ పుస్తకాలు సిలబస్‌లో పెట్టి questions and answers బట్టీ పెట్టిస్తారు

అందుకే గదా మాలాంటి వాళ్లం - డిగ్రీ రెండో సంవత్సరం దాకా అన్నేసి ఇంగ్లీషు పుస్తకాలు పెట్టినా - 4 ఎస్సేలూ, 4 annotation లూ కంఠతా పెట్టి గట్టెక్కేశాం ఈ రోజుటికీ 4 వాక్యాలు ఇంగ్లీషులో రాయలేకపోతున్నాం!

ఒక విద్యా సంవత్సరంలో 210 రోజులు స్కూలు జరుగుతుందనుకుందాం ఈ రోజుల్లోనే, నాలుగు యూనిట్‌టెస్టులూ, క్వార్టర్లీ, హాఫ్ఇయర్లీ, ప్రీఫైనల్ ఎగ్జామ్స్ జరుగుతాయి గాబట్టి 30 రోజులు తీసేయండి

అంటే కేవలం పాఠాలమీద 180 రోజులు వుంటారనుకుందాం

పాపం, ఇప్పట్లో పిల్లలకు సిలబస్ కొంచెం ఎక్కువేలే అని ఫ్యాషన్‌గా వొక కామెంట్ చేసి వొదిలేస్తున్నాం అట్లా కుదరదు టెన్త్ పుస్తకాలన్నీ ముందరేసుకుని కూర్చోండి తెలుస్తుంది

Physical sciences పుస్తకం తెరవండి. ఏఏ నెల ఏఏ పాఠాలు చెప్పి syllabus ఎట్లా పూర్తి చెయ్యాలో కూడా ఇచ్చారు

అదంతా వొకసారి చదివే ఖర్మ మనకేం పట్టింది గానీ పైకి కాసేపు సరదాగా అందులో వున్న పాఠాల పేర్లయినా చూద్దాం.

జులై నెల్లో ఈఈ పాఠాలు చెప్పేసెయ్యండి అని వుంది అవి ఇవీ

(1) Circular Motion (2) Banking Roads and Rail Tracks (3) Simple Harmonic Motion (4) Electromagnetic waves - spectrum (5) Natural and Forced Vibrations (6) Progressive and stationary waves (7) Velocity of sound in air (8) Rutherford's model of atom and its drawbacks (9) Bohr's model of atom and its limitations (10) Summerfeld's elliptical model (11) Sub energy levels - quantum numbers (12) Atomic Orbitals (13) Relative energies of the atomic orbitals (14) Electronic Configuration of atoms

(15) Some physical quantities of atoms (16) Covalent bond (17) Multiple Covalent bonds (18) Co-ordinate Covalent bonds (19) Shapes of some molecules

ఇట్లా జులై నెల్లో 26 periods లో ఈ మొత్తం అంశాలనూ టీచర్లు చెప్పేసెయ్యాలి, పిల్లలు నేర్చుకునేయాలి.

వాళ్ల ప్రాణానికి ఈ వొక్క సబ్జెక్టే గాదే మిగతా ఆరూ కూడా ఇదే మోతాదులో జరిగిపోతూ వుంటాయి గదా.

ఇవేమీ అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా.. గాజువాకే పిల్లా మాది గాజులోళ్లమే పిల్లామేము... సినిమా పాటలు కాదు నాయినా టకటకటకా నేర్చుకునే దానికి! సబ్జెక్టులు!!

టీచరుకు వొకటే వొక సబ్జెక్టు!

పిల్లలకు ఆరు!!

మేదావులు ఇట్లా మడ్డి జంతువుల్లా సిలబస్‌ను పెడతారా . వాటిని పూర్తి చేశామని చెప్పుకోవడానికి స్కూళ్ల వాళ్లు కానీగానీ వేళల్లో కూడా క్లాసులు పెట్టుకుంటూ వుంటారు.

ఎండాకాలం సెలవుల్లో కూడా చెప్పడం, ఉదయాన ఆరుకే extra class లు ప్రారంభం కావడం ..

పిల్లలమీదికి ఎన్నిరకాల పుస్తకాలు తోడేళ్లలా పడి పీక్కుతింటాయో చూడండి

"సిలబస్సే పూర్తి చెయ్యలేక చస్తున్నామండీ! ఇంక నోట్స్ ఎక్కడ ఇస్తాం?" అని చెప్పి చాలా స్కూళ్లల్లో maths కు తప్ప దేనికీ నోట్స్ ఇవ్వరు

అందుకని ఆరు సబ్జెక్టులకూ ఆరు వర్కు బుక్కులు ఉరఫ్ గైడ్స్ అలియాస్ క్వశ్చన్ బ్యాంకులు

కొంతమంది parents, "అదేంటండీ మన స్కూల్లో టీచర్లు నోట్సే ఇవ్వడం లేదు" - అంటూ logic తీస్తారని స్కూళ్లవాళ్లు ఏం చేస్తారంటే గైడ్స్ చూసి textual questions అన్నీ నోట్స్‌లో రాసుకోండమ్మా అని రాయించి చంపుతారు ఒకసారి రాస్తే 4 సార్లు చదివినట్టు అనే పాయింటొకటి ఏడ్చింది గదా

ఒక స్టూడెంటు కేవలం వర్కుబుక్కుకు పరిమితమైనాడనుకుందాం. గైడు చదువుతున్న పిల్లవాణ్ని పట్టుకుని పేరెంటు, "ఏంరా గైడు చదువులకు తయారయ్యావా? Text books చదవాలిరా text books! అప్పుడే bits చెయ్యగలవు లేకపోతే నువ్వు maximum marks score చెయ్యలేవు." అని

ననకు తయారౌతారు.

ఒకవేళ text book నాలుగు మూలలూ చదివితే చాల్లే అనుకుంటే, టీచరూ, స్కూలు వాడూ అంటారు· "గైడు కూడా చదవాలమ్మా! గైడ్‌లో experts ప్రశ్నలు తిరగేసి మరగేసి ఎన్నిరకాలుగా అడుగుతారో చూసి ఇస్తారు Subjects ను కాస్త expand చేసి బిట్స్ ఇచ్చి వుంటారు వొట్టి text book చదివితే చాలదు!"

Text books, work books, వాటినే చూసి రాసిన నోట్సు . ఎన్నని!

ఈ సిలబస్ ఇట్లా పాపం పుణ్యంలేకుండా పెట్టేశారు కాబట్టి పిల్లలకు విపరీతమైన home work కాసేపు ఇంటి దగ్గర ప్రశాంతంగా పడివుందాం అంటే కుదరనే కుదరదు.

టీచర్ల మధ్య కోఆర్డినేషన్ ఎందుకుంటుంది చెప్పండి? తెలుగువాడూ, ఇంగ్లీషువాడూ, ప్రతీ సబ్జెక్టువాడూ - హోంవర్కు ఇవ్వడమే పని!

"ఈరోజు 10th కి, maths సార్ వొక exercise అంతా హోంవర్కు ఇచ్చాడట పాపం!" అని చెప్పేసి physical sciences సార్ ఆ రోజు వూరుకుని ఇంటి కెళ్తాడా? ఆయన 1998 లో public కు వచ్చిన question paper కు answers రాసుకురండి అని ఆర్డరేస్తాడు.

హోంవర్కుల్ని పిల్లలు ఎంత గుడ్డివాటంగా రాస్తారో చెప్పడానికి-

మా టాంసాయర్ 5వ తరగతి గదా. వాడి maths టీచరు ఎనిమిదో ఎక్కాన్ని 20సార్లు రాసుకురమ్మన్నాడు. వీడు ఇంటికొచ్చి,

ముందు 8 x 1=

8 x 2=

8 x 3=

8 x 4=

ఇట్లా గుడ్డిగా వరసగా వేసుకుంటూ పోవడం, ఆ తర్వాత 8, 16, 24, 32... వరసగా వేసుకుంటూ రావడం!

దేనికీ కష్టం!

ఎట్లాగూ స్పెషలైజేషన్ వుందిగదా ఇప్పుడు. ఇంటర్ అయిపోయాక డిగ్రీలో పిల్లలు వివరంగా చదువుకుంటారు. Maths అయినా, Physics అయినా ఏదైనా అట్లాగే వుండాలి. వాళ్లకు భవిష్యత్తు లేదా ఏమి?

అంతేగానీ 8th లోనే linear program నీ, 9th లోనే analytical geometry నీ, 10th లోనే trigonometry నీ గుప్పించేసి ప్రాథమిక విద్యను ఉన్నత విద్య

చేసేసేదాకా నిద్రపట్టదా ?

టీ గ్లాసులు కడిగే పిల్లలూ, గొడ్లుకాసే పిల్లలూ, పొలంపనుల కెళ్లే పిల్లలూ వెట్టిచాకిరీ చేస్తున్నారుపాపం అని మేధావులు అనుకుంటున్నారు గానీ అదే హాయి అని పిల్లలనుకుంటున్నారు.

అసలుసిసలు నరకయాతనా, వెట్టిచాకిరీ మీరు పెట్టిన సిలబస్‌ను స్కూలుకెళ్లి చదవడంలోనే వుంది నాయనలారా!



# తలకాయలైతే వున్నాయి గదా, ఆలోచిద్దాం!

పిల్లల్ని చూసి పీటలెయ్యడం, మొహాల్ని చూసి బొట్లు పెట్టడం మన రక్తంలో జీర్ణించుకుపోయింది.

క్లవర్‌గా వున్న పిల్లల్ని చూస్తే ఎందుకు తల్లిదండ్రులూ, టీచర్లూ ప్రాణా లిచ్చేస్తారో నాకు అర్థమే గాదు

పాఠం చెప్పేటప్పుడు అయ్యవారిని గమనించండి ఆయన మొహం - క్లాసులో వుండే ఇద్దరు ముగ్గురు క్లవర్‌లనే చూస్తూ వుంటుంది

పొరబాటున ఆయన చెప్పే పాఠం వొక డల్లర్‌కి కూడా అర్థమై పోయి, "అవును సార్ కరెక్ట్ సార్." అంటూ వున్నాడనుకోండి "ఏంరా మొద్దుమొహమా! తలకాయ భలే వూగించేస్తున్నావ్, పెద్ద అర్థమైపోయిన వాళ్లాగా!" అనేసి అవమానించే దాకా వూరుకోడు

Clevers కు అర్థమైతే చాలు, ఆ పాఠం అక్కడికి పూర్తయిపోతుంది

అమాయక చక్రవర్తులకు రాక్షసంగా 'మొద్దులు' అని పేరు పెట్టేసి clevers వెనకాన పరుగులెత్తి ఇద్దరిముగ్గురికి 540 దాటించేసి గొప్ప టీచర్లుగా feel అయిపోతున్నాం.

పాపం parents కూడా పిల్లల్నే తిడతారు. "సార్‌లు పాఠాలు బాగా చెప్పకపోతే వాళ్లకి మాత్రం ఎట్లా వచ్చాయి 540లు తమరిలో పసలేదంటే!"

ఇప్పుడు రాజ్యమంతా clevers దే!

నాకీ క్లవర్‌లంటే ఎంత కోపమంటే -

వొకసారి, 90 ఇసుకా 10 సిమెంటూ కలిపి ఆ కాంట్రాక్టూ ఈ కాంట్రాక్టూ చేసి బాగా సంపాయించిన వాడొకడు స్కూలుకొచ్చి, " మా అమ్మపేరుతో సంవత్సరం సంవత్సరం 5వేలు డొనేషన్ ఇస్తాను ర్యాంక్ స్టూడెంట్ కివ్వండి " అనేసి అన్నాడు.

నేనప్పుడు కరస్పాండెంట్ రూంలో వున్నాను. నోరు వూరుకోదు గదా

"Ranker ఎట్లాగూ దేశాన్ని దొబ్బుతాడు సార్. వాడికెందుకు మీ సహాయం? నా మాటవిని డల్లర్ కివ్వండి. వాడెట్లాగూ కాలేజీ మెట్లు ఎక్కలేడు గదా మీ పేరు చెప్పుకుని రిక్షానో పాడో కొనుక్కుని పొట్టపోసుకుంటాడు!"

పాపం, ఆయనకెంత కోపం వొచ్చిందో చెప్పలేను కానీ దేవుడు మాత్రం నామాటలు విని చప్పట్లు కొట్టి వుంటాడు.

"డల్లర్ కి ఇచ్చేదేమిటండీ డల్లర్‌కి !" అని ఆయన ఇంతెత్తు ఎగిరినాడు

డల్లర్ అంటే ఎంత చిన్న పక్షి అంటే - 1/2 పెద్దదా, 1/4 పెద్దదా అంటే టెన్త్ అయ్యాక కూడా 1/4 పెద్దదంటాడు మరి, ఈ తెలివి మీరిన లోకంలో ఆ పక్షి ముక్కుకి నాలుగు గింజలెట్లా దొరుకుతాయి?

ఒక నక్క వుంటుంది అది 'ఆకాశం పడిపోతూవుంది పరిగెత్తండి పరిగెత్తండి' అని పుకారు పుట్టించి హెచ్చరించగలదు. దాని మాటలు నమ్మి కోడిపెట్టా, కుందేలు పిల్లా 'పదపద' అంటూ దాని వెనకాన గుడిసెలోకి చేర్తాయి. నక్క clever గదా తలుపులు గెడియ పెట్టి శుభ్రంగా మూతి నాక్కుంటుంది.

కృషి బ్యాంకు పెట్టినాయన డల్లరా ? క్లవరా?

-ఇట్లా ఇద్దరు ముగ్గురు clevers ని మనం నెత్తినెత్తి పెట్టుకోబట్టే పిల్లలకు స్కూలంటే రోత. టీచరు చచ్చిపోయి స్కూలికి సెలవిస్తే కులుకు

హైద్రాబాద్‌లో లక్ష్మయ్య అని నాకో స్నేహితుడున్నాడు వాళ్ల పాప రెండో మూడో చదువుతోంది. ఒక రోజు యూనిఫాం మీద స్వెట్టరు కూడా వేసుకుని స్కూలు కెళ్తుండడం చూసి, "ఏం తల్లీ స్వెట్టర్ వేశావ్!" అన్నాడు

"టీచర్లు కొడుతుంటారు గదా నెప్పితగలకుండా వుంటుందనీ..."

ఆ పిల్ల అంతమాట అనేసిందంటే విద్యావ్యవస్థ మొత్తం సిగ్గుతో తలదించుకోవాలి గదా ఇంకెందుకూ back to school ప్రోగ్రాంలో తలము నకలవడం!

చేతిలో chain పట్టుకుని వొక parent స్కూల్ ముందు నిలబడి వున్నాడు ఆయనది తిరుమల. ఏదో వ్యాపారం చేసుకుంటూ పిల్లవాణ్ణి హాస్టల్‌లో పెట్టి తిరప్తిలో చదివించుకుంటున్నాడు. ఆయన్ని చూసి నాకు భయం వేసింది- పిల్లవాడు బైటికొస్తే పట్టుకుని ఆ chain తో కొడతాడేమోనని! ఇప్పుడెట్లరా భగవంతుడా - అని నాకు ఉచ్చ పడుతూ వుంటే అడిగాను "ఏంసార్!" అని.

"మా వాడికి పావురాల problem సార్ అందుకనీ-" అన్నాడు.

'సే-

తిరుమలలో-వాళ్లింట్లో పావురాలు దండిగా వొచ్చి వాలేటట్టుంది పిల్లవాడు నాలుగో తరగతి. వాటికి బాగా అలవాటైపోయి ఈ స్కూలికీ, హాస్టల్‌కీ అలవాటు కాలేక పోతున్నాడు.

స్కూల్‌లో ఏముండి చస్తుందీ! ఇంటి దగ్గరుంటే పావురాల్తో ఆడుకోవచ్చు గదా అందుకని స్కూల్‌వాళ్ల కళ్లుగప్పి మాటిమాటికీ తప్పించుకుని కొండకు నడుచుకుంటూ వెళ్లిపోవడం!

వాళ్లనాయిన మళ్లీ వాణ్ణితెచ్చి స్కూల్లో పడెయ్యడం ఇదీ జరుగుతున్న కధ

"కాళ్లకు గొలుసు వేశామనుకో, తప్పించుకోలేడు గదా నిదానంగా స్కూల్‌కీ, హాస్టల్‌కీ అలవాటు పడిపోతాడు."

ఇంకేం మాట్లాడతాం చెప్పండి?

స్కూళ్లు ఎందుకింత నరకకూపాలుగా తయారవుతున్నాయి?

ఎందుకని పిల్లవాడు టీచర్‌ని మన మనిషి అని నమ్మలేకపోతున్నాడు?

మునక్కాయ ముప్పావలా లెక్కన వొక ముసలవ్వ వీధిలో మునక్కాయ లమ్ముతోంది. ఒక బీదరాలు ఆ అవ్వ దగ్గిర మూడు మునక్కాయల్ని కొనుక్కుంది.

ముసలవ్వ చేతిలోకి రెండుంపావలా, బీదరాలి చేతికి మూడు మునక్కాయలూ చేరిపొయ్యాయి.

చదువూ సంధ్యాలేని వాళ్లిద్దరి మధ్యా భిన్నాలకు సంబంధించిన వొక పెద్ద లెక్క గుట్టు చప్పుడు గాకుండా జరిగిపోయింది!

$3/4 \times 3 = 2.25$

మూడోమనిషికి తెలీకుండా జరిగిపోయిన ఈ లెక్క ఎగురుకుంటూ స్కూలుకు వచ్చిందనుకోండి.

ఒక బోర్డూ, చాక్‌పీసుల బాక్సూ, వొక పుస్తకం, నాలుగు బెత్తాలూ, వొక డిగ్రీ హోల్డరూ
శవంపడిన ఇల్లు మాదిర్తో ఏడుపులూ, పెడబొబ్బలూ..!

**TIME TABLE**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| Mon | playing | playing | playing | playing | playing | playing | reading |
| Tue | " | " | " | " | " | " | English |
| Wed | " | " | " | " | " | " | maths |
| Thu | " | " | " | " | " | " | Telu |
| Fri | " | " | " | " | " | " | Social |
| Sat | " | " | " | " | " | " | Hindi |

ఇట్లా time table రాసుకున్న టుట్టీ అనే వొక పిల్లాణ్ణి అదేంరా అంటే వాడు, "ఇట్లా వుంటే ఎంత బాగుంటుందా అని తమాషాగా రాసుకున్నా!" అనేసి అన్నాడు.

స్కూళ్లనూ, టీచర్లనూ పిల్లలు పామును చూసినట్టు చూస్తున్నారు.

టీచర్లంతా గుండెల మీద చేతులేసుకుని ఆలోచించాలి.

# కొంపలు కూల్చే ఫిజిక్స్

Physics అంటేనే పిల్లలకు బిత్తర. EAMCET లో Maths లో నూటికి 70, 80 మార్కులు తెచ్చుకునే వాళ్లు కూడా physicsలో 50కి 10, 15 తెచ్చుకోలేక తేలకండ్లు వేసేస్తారు

Speed, velocity, acceleration - ఈ మూటికీ వున్న తేడాలు తెలుసుకోవడం - ఇడ్లీకీ, దోసికీ, వడకీ తేడాలు తెలుసుకోవడం అంత తేలికేం కాదు

పైకి ఎంతో సులువుగా కనిపించే ఈ physics పిల్లల దుంప తెంచుతోంది

Problem. **A bus travels a distance with a speed of 50 km/hr and returns with a speed of 40 km/hr. Find the average speed of the whole journey.**

పైకి average అనేయగానే 50నీ 40నీ కూడేసి రెండుతో భాగించేస్తే సరిపోతుందనుకుంటాం. Choose the correct answer లో ఆ answer కూడా వుంటుంది గానీ correct కాదే!

మా ఇంటికొకసారి హెడ్‌మాస్టర్‌గా వుంటున్న సైన్స్ టీచరొకాయన వొచ్చినాడు నా కూతురు దీప్తిని చూసి, "ఏం చదువుతోంది సార్?" అనడిగినాడు. తొమ్మిది-అని చెప్పినా "పాప ఎట్లా చదువుతోంది?" అనేసి అడిగినాడు "బాగానే చదవతా వుంది" అని చెప్పినా

ఆయన, "Newton's third law of motion చెప్పమ్మా!" అనడిగినాడు.

"For every action there is an equal and opposite reaction" అని చెప్పింది

హెడ్‌మాస్టర్ సారు, "మీ అమ్మాయి మంచి క్లవర్ సార్," అనేసి మెచ్చుకున్నాడు

తండ్రిగా నేను మెచ్చుకోను గదా. "Third law ఏముంది? ఫిజిక్స్ చదువుకోని గుడ్డి ముసిల్ది కూడా చెప్పేస్తుంది Newton's first law of motion అడిగి చెప్పించండి చూద్దాం." అని లాపాయింటు తీసినా.

ఆయన, "చెప్పమ్మాయ్. Newton's first law of motion చెప్పు." అన్నాడు.

నా కూతురు కొంచెపు బిత్తర చూపులు చూసి, "ఐడియా లేదంకుల్. ఒకసారి చూసుకుంటే చెప్పగలను. లేదంటే మీరు బిగినింగ్ ఎత్తివ్వండి, చెప్తా!" అనడిగింది.

"ఏంది బిగినింగ్ ఎత్తించేదీ..." అని నేను వొంటికాలి మీద లేవబోయి, 'ఎందుకులే మూడో మనిషి ముందు...' అనేసి నిమ్మళపడి, "మీరు అర్థమయ్యేటట్టు చెప్పండి సార్ పాపం!" అన్నాను.

అందుకా సార్, "ఆ పాప చెప్పింది నిజమేసార్ నేనైనా ఒకసారి చూసుకోవాల్సిందే." అనేసి అన్నాడు.

ఇదంతా నేనెందుకు చెప్పుకొస్తున్నానంటే - మా గడపతొక్కిన ఒక పెద్దమనిషిని పలచన చేద్దామని గాదు. Subject ఎంత కఠినంగా వుందో చెప్పడానికి.

ఆయన బీఎస్సీ ఎంపీసీ చేసి 25 ఏండ్లుగా సైన్సు చెప్తున్న సారుమరి!

నిజానికి Newton's first law of motion అంత కొరకరాని కొయ్యేం గాదు మామూలు మాటల్లో చెప్పుకోవాలంటే-

నలుచదరంగా వున్న ఒక మైదానంలో football ఒకటి పడివుంది. దాని మీద ఏ శక్తీ పని చేయనంత వరకూ అది అట్లా నిద్రపోతానే వుంటుంది ఒకవేళ ఆ football దొర్లుకుంటూ దొర్లుకుంటూ పోతూ వుందనుకోండి. అప్పుడు కూడా దానిమీద ఏ శక్తీ పని చేయకుంటే అదట్లా పోతూనే వుంటుంది

శాస్త్ర ప్రకారం చెప్తే, Everybody continues in its state of rest or of uniform motion in a straight line unless acted upon by an external force to change its state

Physics లో పిల్లల performance బాగా లేకపోవడానికి ఒకటి రెండు మెతుకులు పట్టి చూద్దాం.

Physics లో తలమానికంగా ఉన్న kinematics ను text books రాసిన పెద్దలు - పిల్లలకు ఎట్లా introduce చేశారో ముందు చూద్దాం.

పిల్లలకు kinematics 8th class లో introduce అయ్యింది. దీనిమీద text books లో 12 pages material వుంది. దాన్ని గాని టీచర్లు శుభ్రంగా చదివి, పిల్లలకు చెప్తే super గా అర్థమవుతుంది. అంత అద్భుతంగా వుంది Distance అంటే ఏంది, displacement అంటే ఏంది, speed అంటే ఏంది, velocity అంటే ఏంది, వాటికున్న తేడా ఏంది - అంతా ఎంతో బాగుంది ఆ 12

పేజీల మేటరూ ఇక్కడ రాయడం ఎందుకులెండి, అంత పొందిగ్గా వుంది.

ఇంక 9th class కి వద్దాం.

In your previous classes you have learnt about scalars, vectors, speed, velocity, acceleration and retardation Now you will learn about the equations of motion

అని మొదలు పెట్టి

$V = u + at$

$s = ut + ½ at^2$

$V^2 - u^2 = 2as$ - ఈ మూడు equations కీ derivations ఇచ్చినారు

ఇంతటితో మూడు పేజీలయ్యాయి. దీనికింద మరో రెండు పేజీల్లో problems ఇచ్చి workout చేశారు

అందులో ఒక problem మనం చూడాల్సిందే

**A body starting from rest is travelling with an acceleration of 4 m/sec². Calculate the distance travelled by it in the 4th second.**

**Solution** Initial velocity u = O m/sec

Acceleration a = 4m/sec²

Distance travelled by it in the 4th second (S4th) = ?

Using the formula

$S_{nth} = u + a (n - ½)$

Here n = 4, u = 0, a = 4m/sec²

S4th = 0+4 (4 -- 1/2)

= 4 (7/2)

= 14m

ఇంతే

ఇందులో ఒకమాటను జాగ్రత్తగా చూడండి.

Using the formula

Snth = u + a (n--1/2)

ఇదేం ఫార్ములా? text bookలో derive చేసిన ఫార్ములాలు మూడే మూడు. అవి:

$V = u + at$

$S = ut + 1/2at^2$

$V^2 - u^2 = 2as$

మరి ఇదెక్కణ్ణుంచి వచ్చింది? దీన్ని example problem గా ఎందుకిచ్చారు? పైగా exerciseలో కూడా ఈ formula use చేస్తేనే answer వచ్చే లెక్క వొకటి ఇచ్చినారు.

ఈ problem ను పట్టుకుని నాకిప్పటికిప్పుడు ఆగడం చేసెయ్యా లని పిస్తోంది. ఈ kinematics లో s అనీ, u అనీ, t అనీ, a అనీ, v అనీ ఇలాంటి అక్షరాలకు వివరాలు వున్నాయేకానీ, 'n' అనేది ఎక్కడా లేదే!

s అంటే distance

u అంటే initial velocity

t అంటే time

v అంటే final velocity

a అంటే acceleration

అట్లాంటిది ఈ 'n' అంటే ఏందో భగవంతుడికే తెలియాలి.

ఈ లెక్క మీద మా ఇంట్లో ఎంత గొడవయ్యిందో చూడండి

వాళ్లమ్మ చెప్పేది - స్కూలునుంచి వొచ్చాక నా కూతురికి ఒకటే పనంట, అది· Zee Music, MTV, B4U మార్చిమార్చి హిందీపాటలు వినడం. రోజురోజుకూ శుద్ధ దండగ అయిపోతూ వుందంట.

అందుకని నా కూతురికి నేను వారంవారం maths లో, physics లో test లు పెట్టాలంట. నా భార్య పోరు పళ్లేక ఒకరోజు physics text book తీసుకుని "kinematics లో test పెట్టనా?" అనేసి అన్నా.

"ఓ పెట్టుకో." అంది దీప్తి.

నేను,

(1) Derive $S = ut + 1/2\ at^2$

(2) ఇంతకు ముందు మనం వేసిన లెక్క.

ఈ రెండూ ఇచ్చినా. ఆ పాప పావుగంటలో derivation వేసేసి ఆ లెక్క వెయ్యలేకపోయింది.

నేను - నీకు పదికి అయిదు మార్కులొచ్చినాయి పో. అనేసి గమ్మనుండి పోయినా.

ఇంక వాళ్లమ్మ ఎత్తుకునింది చాటభారతం. అంతా ఇంతా కాదు. అప్పుడే నా కూతురికి EAMCET లో ఫ్రీసీటు రానట్టు ఆ రచ్చ ఇక్కడ చెప్పలేను.

నాకూ బాధయ్యింది Text book లో వున్న example problem కూడా

వెయ్యలేకపోతే ఎట్లమ్మా అని నేను కసిరినాను.

"నువ్వేయ్ చూద్దాం." అని నా కూతురు సవాలేసింది నేను ఆ లెక్క తీసుకుని, "అవును formula use చేస్తే సరిపోయింది గదా " అన్నాను

"అదేం ఫార్ములా? text book లో అసలు లేదు " అనింది.

చూస్తే నిజమే! ఆ formula నే తెలియకపోతే నేను దాన్ని ఎట్లా apply చేద్దును? ఆ పిల్లకు ఎట్లా చెబుదును?

"మీ సార్‌ని అడిగి కనుక్కోమ్మా." అనేసి నేను గమ్మనుండి పోయినాను.

"మా సార్‌కి కూడా తెలవదు. అది ఇంటర్మీడియట్‌లో వుందంట " అని ఆ మర్నాడు దీపు చెప్పింది అసలేంది దాని కథ? అని నాకు పంతం పెరిగిపోయింది.

గంట తర్వాత నాకు విషయం అర్థమైంది

ముందు, $S_{nth} = u + a(n-½)$ formula derivation గురించి తెలుసుకుందాం

A |————————————————| B

A నుంచి ఒక బస్సు B అనే చోటికి బయలుదేరడానికి సిద్ధంగా వుంది A వద్ద నిలబడి వున్న బస్సు initial velocity zero గదా

అంటే $u = 0$.

బస్సు బయలుదేరి ఒక సెకండులో p వద్దకు

|————|————————————————|
A P B

చేరింది. అంటే బస్సు ఒక సెకండులో ప్రయాణించిన దూరం AP

బస్సు రెండవ సెకండులో Q వద్దకు చేరింది. అంటే,

A————|————|————————————B
P Q

బస్సు రెండు సెకండ్లలో ప్రయాణించిన మొత్తం దూరం AQ.

బస్సు రెండవ సెకనులో ప్రయాణించిన దూరం (PQ) =

బస్సు రెండు సెకండ్లలో ప్రయాణించిన మొత్తం దూరం -- బస్సు ఒకటవ సెకండులో ప్రయాణించిన దూరం AQ--AP కదా.

దీన్నిబట్టి,

బస్సు 10వ సెకండులో ప్రయాణించిన దూరం = బస్సు 10 సెకండ్లలో ప్రయాణించిన మొత్తం దూరం -- బస్సు 9 సెకండ్లలో ప్రయాణించిన దూరం.

ఇప్పుడు formula derivation కి వద్దాం.

$S = ut + 1/2at^2$ అని మనకు తెలుసు. Text book లో derivation కూడా ఇచ్చారు.

బస్సు మొదటి సెకండులో ప్రయాణించిన దూరం $S_1 = u \times 1 + \frac{1}{2} a \times 1 \times 1$

$= u + \frac{1}{2} a$

బస్సు రెండు సెకండ్లలో ప్రయాణించిన దూరం $S_2$

$= u \times 2 + \frac{1}{2} \times a \times 2 \times 2$

$= 2u + 2a$

బస్సు 2వ సెకనులో ప్రయాణించిన దూరం $S_{2\,nd}$

$= S_2 - S_1$

$= 2u + 2a - (u + a/2)$

$= u + a (2 - \frac{1}{2})$

బస్సు 3 సెకండ్లలో ప్రయాణించిన దూరం

$S_3 = u \times 3 + 1/2 \times a \times 3 \times 3$

$= 3u + 9/2 \times a$

బస్సు 3వ సెకండులో ప్రయాణించిన దూరం $S_{3rd}$

= బస్సు 3 సెకండ్లలో ప్రయాణించిన దూరం $S_3$

-- బస్సు 2 సెకండ్లలో ప్రయాణించిన దూరం $S_2$

$= 3u + 9a/2 - (2u + 2a)$

$= u + a (3 - \frac{1}{2})$

జాగ్రత్తగా చూస్తే బస్సు 2వ సెకండులో ప్రయాణించిన దూరం $= u + a (2 - \frac{1}{2})$

3వ సెకండులో ప్రయాణించిన దూరం $u + a (3 - \frac{1}{2})$

అట్లాగే 4వ సెకండులో... $u + a (4 - \frac{1}{2})$

ఇట్లా చేసుకుంటూపోతే,

'n' వ సెకండులో బస్సు ప్రయాణించిన దూరం $S_{nth} = u + a (n - \frac{1}{2})$

ఇదీ దీని కథ.

n సెకండ్లలో బస్సు ఎంత దూరం పోయిందీ, n వ సెకండులో ఎంత దూరం పోయిందీ అన్నదానికి ఎంత తేడా వుందో చూడండి

ఇలాంటి derivation పిల్లలకు చేసి చూపించకపోతే ఎట్లా? పోతేపోనీలే, ఎక్కడో ఒక మూల చిన్న confusion దాన్దేముంది అనేదానికి లేదు. మరి, కాలాలు అట్లావున్నాయి EAMCET లో ఒక ప్రశ్న syllabus లో లేకపోయినా, తప్పుగా ఇచ్చినా దానిమీద కోర్టులో వ్యాజ్యాలు పడిపోతున్నాయి Physics లో ఇంటర్ ఫస్ట్ ఇయర్‌లో 60కి 58 వచ్చినా ఆ రెంటికోసం improvement

రాసే పరిస్థితులున్నాయి. అట్లాంటప్పుడు చిన్న క్లాసుల్లో ఎంత జాగ్రత్త వుండాలి?

కొన్ని పెద్దపెద్ద స్కూళ్లు - మేం పెట్టే పరీక్షలు చక్కగా రాస్తే 10th free coaching అని ప్రకటనలు చేస్తుంటాయి. చక్కగా రాయడం అంటే నూటికి నూరు తెచ్చుకోవడం. ఇలాంటి confusions తో పిల్లలు ఎలా తెచ్చుకుంటారు?

Text books రాసే పెద్దలకు హద్దుమాలిన దయవుండాలి పిల్లలంటే. వాళ్లకి మేధావితనం కంటే దయ ఎక్కువగా వుండాలి.

ఇంక 9వ తరగతి dynamics లో చిన్న ఉదాహరణ చూసి వదిలేద్దాం.

Dynamics introduce అయిన 2వ పేజీలోనే W = FS CosA అని ఒక ఫార్ములా ఇచ్చేసినారు.

W సరే, F సరే, S సరే. ఈ CosA ఏంది? SinA, CosA అనేది Trigonometry కి సంబంధించినవి. ఇది పిల్లలకు టెన్త్‌లో Maths లో వస్తుంది.

కానీ 9th లోనే తొందరపడిపోయి trigonometry ని, physics లో ఇచ్చేస్తే ఎలా?

ఇన్ని confusions తో పిల్లలు వేగలేక ఏదో బట్టీపెట్టడం.

నా కూతురికి దాన్నీ, దీన్నీ analyse చేసి చెప్తూవుంటే ఆ పిల్ల, "పెద్ద educationalist అని ఫోజొకటి. ఇవి చెప్పడానికి నీకే ఇంత ఆయాసంగా వుంటే వాటిని నేర్చుకోవడానికి మాకెంత కష్టంగా వుంటుందిరా పంది నాయాలా?" అని తిట్టింది.

నా కూతురు నన్నేకదా తిట్టింది!

మూడేండ్లకు ముందర విజయవాడలో ఇంటర్ చదివే ఒక తల్లి,

" ఈ speed నూ
velocity నీ
acceleration నీ
మీ నెత్తినేసుకుని
రుద్దుకోండి.
ఈ physics లేని
లోకానికి నేను
వెళ్లిపోతున్నాను." అంటూ రాసిపెట్టి చచ్చిపోయినా ఎవురు మాత్రం పట్టించుకున్నారు?!

✡

# పసిపిల్లలమైపోయి Maths చెప్పాలి !

Maths, English శుద్ధంగా చెప్పి చస్తే పిల్లలకు ఏ పీడా వుండదు.

మరీ ముఖ్యంగా Maths చెప్పేసార్ నిత్యం బాలకుడుగా వుండాలే గానీ వొక్కసారిగా మేధావి అయిపోగూడదు.

గుండెల మీద చెయ్యేసి నేను కొన్ని విషయాలు - నాకు సంబంధించినవి చెప్తా.

నేను M Sc Maths చదివాను. అందువల్లా నాకు లెక్కలొచ్చినాయి అనేది ఎంత అన్యాయమో చెప్పలేను నా బాధ ఏమంటే డిగ్రీలనూ, బి ఇడీలనూ మాత్రమే ప్రమాణాలుగా తీసేసుకుని వొక పెద్ద గుంపును టీచర్లుగా స్థిరపడిపోనీయొద్దూ అని!

నేను ఇంగ్లీషులో ఎంత పూరో చెప్పలేను. 15 సంవత్సరాలు నేను పత్రికల్లో పనిచేశానన్న మాటేగానీ నేను జర్నలిస్టును ఎట్లవుతా! Hindu పత్రిక సంపాద కీయాన్ని నా చేతల్లో పెట్టి తెలుగు చెయ్యమంటే నా జీవితకాలం సరిపోదు. కానీ నేను జర్నలిస్టుగా 15 సంవత్సరాలు చెలామణీ అయ్యా.

ఇప్పటికిప్పుడు నేను M.A , English డిగ్రీ తెచ్చుకునేసేదా!

ఏముందీ! ఒక్కో పేపరుకు 10, 12 ఎస్సే కొసిన్లు నేర్చుకుంటా, పోయి రాసేస్తా, డిగ్రీ తెచ్చుకుంటా!

నాకు tenses మీద కూడా అయిడియా వుండదు, M.A., English అని చెప్పుకుని తిరుగుతుంటా

అట్లాంటి M Sc , Maths నే నేను చదివింది.

M Sc , Maths అయిపోయిన అయిదారేళ్లకు నన్ను ఎవరో 3+2 x 4 ఎంత అని అడిగితే నేను కూడా పిలకాయల మాదిర 20 అని చెప్పిన దద్దమ్మనే

ఇప్పుడు ఇస్కూలు పిలకాయల కత అనీ, పిల్లల భాషలో Algebra అనీ ఏవో రెండు పుస్తకాలు మిణికాక నన్ను అయిదారుగురు - Maths లో భలే gem అని పొరబడ్డారు.

నాకు ఎంత సిగ్గుగా వుంటుందో చెప్పలేను నా పిలకాయలు ఎక్కివచ్చాక నేను 5వ తరగతి నుంచీ పదవ తరగతి దాకా పుస్తకాలను ముందరేసుకుని శ్రద్ధపడితే పుస్తకాల్లో వున్న విషయాలు నాలుగోవంతు వరకూ నాకు వంటబట్టాయి.

వున్నట్టుండి ఎనిమిదో తరగతిలో వొక లెక్క ఇచ్చి "నువ్వేదో పెద్ద మేధావి అని ఫోజు కొడుతున్నావు. వెయ్‌రా దీన్ని!" అంటే నేను ఏరిగిపెడతాను నాశనం

అంత భయం నాకు లెక్కలంటే. అవి అంత జటిలంగా కూడా వుంటాయి

గుడ్డివాటంగా నేను ఏ లెక్కనూ వెయ్యనూ లేను, పిల్లలకు చెప్పనూ లేను.

ఏ చాప్టర్‌ను తీసుకున్నా అందులో విషయాలు గడ్డివామి వేసినంత బాగా అర్థం చేసుకోనిదే నేను పిలకాయల ముందు వాటిని చెప్పలేను

లెక్కలకు సంబంధించి వొక పెద్దాయన అన్నమాటలు నాకు బాగా గుర్తు. ఆయన ప్రొఫెసర్ కుప్పుస్వామి రావు.

"చిన్నప్పుడు నాకెట్లాంటి డౌట్లు వచ్చినాయో అవే డౌట్లు మీకెట్లా వచ్చినాయి? వాటిని భలే క్లియర్ చేశారే!" అని అన్నారాయన పిల్లల భాషలో Algebra చదివి.

నేనాయన ముందర సిగ్గుగా నవ్వుతూ నిలబడ్డానే గానీ ఏం మాట్లాళ్లేదు

అట్లా ఆ ప్రొఫెసర్ మాదిరిగా ఎవరూ కూడా మన బాల్యాన్నీ, బాల్యంలో ఈ లెక్కల మీద మనం పడ్డ అగచాట్లనీ మర్చిపోకూడదు.

బిడ్డను వొళ్ళో కూర్చోబెట్టుకుని మజ్జిగన్నం తినిపించి మూతి తుడిచినంత ప్రేమతో ఈ లెక్కల్ని పిల్లలకి చెప్పాలి.

వొక కఱ్ఱ చేతబట్టి పుటుక్కు పుటుక్కుమని కొడుతూ, తిడుతూ ఆగడం చేసేసే వాడెవడూ లెక్కల టీచరుగా పనికేరాడు.

ధర్మరాజుల్లాంటి పిల్లలకి అన్నీ డౌట్లుగానే వుంటాయి.

ఉదాహరణకి తీసివేతలు తీసుకుందాం

అయిదో తరగతి నుంచి ఎనిమిదో తరగతి వరకూ చదివే పిల్లల్ని మీరు

కుంటున్నావు?" అని టెన్త్ పూర్తయిన వాళ్లను అడిగితే చాలు, "ఎంపీసీ తీసుకుంటానంకుల్. ఎంసెట్ ట్రైచేస్తా." అని మాట్లాడేస్తున్నారు.

టెన్త్‌లో ఫస్ట్‌క్లాస్ వచ్చిన పిల్లలు వేలాదిగా వుంటారు పాపం. అదే పచ్చి మోసం. 400 మార్కులు దాటితే దరిద్రం చుట్టుకున్నట్టే లెక్క.

ఇంతవరకూ మనం school education గురించి చూశాం గదా.

టెన్త్‌లో ఫస్ట్‌క్లాస్ తెచ్చుకోవడమనేది - ఇప్పుడున్న పరిస్థితుల్లో ఫెయిల్ అవడంకంటే సులభం.

నా భార్యా ముగ్గేస్తుంది మీ భార్యా ముగ్గేస్తుంది. ఇద్దరూ చిత్రకారులు కానట్టే, మీ అబ్బాయీ, మా అబ్బాయీ ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నంత మాత్రాన 'ఫస్ట్‌క్లాస్' స్టూడెంట్స్ కారు

టెన్త్‌లో ఆయా సబ్జెక్టుల ప్రశ్నపత్రాలన్నీ చూడండి తెలుస్తుంది

4 మార్కుల questions నాలుగిస్తే రెండు రాస్తే చాలు. చాయిస్ బాగా వుంటుంది వేలాది స్టడీ అవర్లు వృధాపోవు.

దాదాపు డిసెంబర్ నుంచి పరీక్షలయ్యేదాకా ఓ అని చదివించడమే గదా పని. చదవడం రాయడం వొచ్చిన ప్రతి పిల్లాడికీ ఫస్ట్‌క్లాస్ వొచ్చేస్తుంది.

10th లో మేధావులు 700 పేజీల సిలబస్‌ను ఫిజిక్సులో పెట్టుకోనివ్వండి. ఏం ఫర్వాలేదు acceleration కు C G.S unit తెలియక పోయినా science లో పాస్ అవడం కాదు 80 మార్కులు వొచ్చేసి వుంటాయి.

$(a + b)^3$ ఫార్ములా రాకపోయినా, $a^3 + b^3$ కు factors అడిగితే బిత్తర చూపులు చూసినా - 90, 92 maths లో వొచ్చేసి వుంటాయి పిల్లలకు.

School education లో అంత magic వుంది మరి.

700 పేజీల పుస్తకంలో నుంచి 60 పేజీలకు సరిపడే material ను తయారు చేసి 'కమలాకుచచూ ...' ప్రార్థనాగీతాన్ని బట్టీ పెట్టినట్టు బట్టీ పెట్టిస్తే సరి. మార్కులకేం దండిగా వస్తాయి.

గ్యాస్ సిలండర్‌లో బ్యూటేన్ వాయువు వుంటుంది అని చెప్పేసినంత మాత్రాన పిల్లాడు chemistry లో రాటు దేలిపోయినట్టు కాదు. అంతా మార్కుల చదువు.

వివిధ పదవుల్లో వున్న మేధావులెవరూ ఇప్పటి 7th class పాస్ కాలేనట్టే - 10th అయ్యాక 5th class knowledge కూడా లేకుండా ఇంటర్‌లో చేరిపోతారు పిల్లలు.

టెన్త్‌లో 3rd class, 2nd class తో బయటపడి పోయే పిల్లలు పూర్వజన్మలో

పుణ్యం చేసుకున్న వాళ్లు వాళ్లని parents కూడా అంతగా పట్టించుకోరు వీళ్లపనైపోయిందన్నట్లు గవర్నమెంటు కాలేజీల్లో హెచ్ ఇ సి., సి ఇ.సి. చేర్పించేసి ఆశ వొదిలేసుకుంటారు

మెడకు తాడు చుట్టుకునేదల్లా ఈ 1st class students కే!

ఇంటర్‌లో సైన్స్ గ్రూప్‌లో చేరే పిల్లలకి - కాలేజీ మెట్టు ఎక్కామన్న ఉత్సాహమే వుండదు.

అవి కార్పొరేట్ కాలేజీలు గదా వాళ్ల డబ్బును క్షణాల్లో లెక్కించడానికే గదా calculator లు అనేవి పుట్టింది!

అక్కడ వొక్కో పిల్లాడికి వొక్కో నిచ్చెన వుంటుంది - నరకానికి!

సెక్షన్లవారీగా విభజన. ఒక్కో సెక్షన్‌కి 70 మంది పిల్లలు కనీసం $J_1$, $J_2$, $J_3$ ... ఇట్లా

టెన్త్‌క్లాస్‌లో 530 మార్కులు దాటిన వాళ్లంతా $J_1$ అనుకోండి $J_8$ అంటే శుద్ధ మొద్దులన్నమాట. కేవలం ఫీజులు కట్టడానికి పనికొచ్చే వొక మూక అని కార్పొరేట్ కాలేజీవాళ్ల అభిప్రాయం!

ఒకనెల పోతే పరీక్షలు జరుగుతాయి గదా. $J_1$వాడు $J_3$ కెళ్లిపోవచ్చు. $J_4$ వాడు $J_1$ కు వొచ్చేయొచ్చు!

ఈ సెక్షన్ల మార్పిడి - నరకానికి తొలిమెట్టు.

సీను ఇంట్లోకి మారుతుంది. ప్రోగ్రెస్ రిపోర్టు వొచ్చి వుంటుంది గదా.

$J_1$ లో వున్న కొడుకు హఠాత్తుగా $J_3$ లో పడ్డాడు. ఆ బాధతో quarter తాగిన వొక పేరెంటు నాతో ఇట్లా అన్నాడు

"సార్ పిల్లలకు మన బాధలు తెలవడం లేదుసార్ 5 రూపాయల వొడ్డీ పడే చీటీ నొకదాన్ని వొకటి సగంగా పాడేసి మా నా కొడుకుని కాలేజీలో చేర్పించా - 10th లో 520 వచ్చాయి గదాని. వాడు నెలైనా $J_1$ లో వుండకుండా $J_3$ లోకి పడిపోయాడు. ఆ నాకొడుకుని చూడాలంటేనే నాకు రోతగా వుంది ఇంటర్‌లో చేరగానే ఎంత తోక పెరిగి పోయిందో చూడండి!"

ఇంక ఆ తండ్రి ఇంట్లో పిల్లాడితో ఎంత రచ్చ చేసి వుంటాడో చెప్పాలా?

10th లో 540 తెచ్చుకుని ఇంటర్‌లో మరీ హాస్టల్‌లో ఉచితంగా చదువుకుంటుంటారు కొంతమంది.

వారిదైతే క్షణక్షణం నిప్పులమీద నడకే.

ఒక్క test లో physics లో 60కి 58 వొస్తే చాలు. ప్రిన్సిపాల్ నుంచి కబురొస్తుంది.

"అంతా ! ఓసీ గదాని బాగా లాగించి నిద్రపోతున్నావా! ఇట్లాగే అయితే

మీ పేరెంట్‌ని పిల్చి చెప్పాల్సి వుంటుంది ఫస్ట్‌టైం మర్యాద ఇస్తున్నాను. వెళ్లు!"

డబ్బు వుండే మహారాజుకి అవసరం వచ్చి అప్పు అడిగితే - ఇవ్వడం అనేది ప్రజలకు ప్యాషనై పోతుంది గదా.

ఇంటర్ చదివే పిల్లల ప్రివిలేజెస్ భలే వుంటాయి తల్లిదండ్రుల దగ్గిర.

పుస్తకాలకు డబ్బు అడిగితే క్షణంలో వుంటుంది

జీన్స్ అడిగితే జీన్స్ కిలో మాంసం తెస్తే 'అరకిలో నువ్వే తిను మేం పస్తులుంటాం. నువ్వు చదవాల్సిందే మార్క్సాల్సింది.' అంటారు.

ఇంటర్‌లో హాస్టళ్లలో చదివే పిల్లలు క్షణక్షణం అయితే తల్లిదండ్రుల నసను తప్పించుకుంటారుగానీ వారం వారం తప్పవు పాపం, హాస్టల్‌లో వున్నవాళ్లను తల్లిదండ్రులకు చూడాలని వుంటుంది. వారానికొకసారి Visiting Hours వుంటాయిగదా అప్పుడు హాస్టళ్ల ముందు సంభాషణలు వినాలి.

ఒక్కరు కూడా కనీసం పైకి అయినా "చదివినకాడికి చాలు tension పెట్టుకోవద్దు. ఎంసెట్‌లో సీటు రాకపోతే కొంపేం మునగదు. B Sc లో చేరవచ్చు" అని అననే అనరు

" మన పరిస్థితులు నీకు తెలుసు గదా ఇంతింత పోసి చదివిస్తున్నాం. నువ్వేం చేస్తావో తలచుకుంటుంటేనే భయంగా ఉంది !"

"మొన్ననే ఇంటికి రిపోర్టొచ్చింది. అమ్మ భలే బాధ పడింది. సెకండ్ ఇయర్‌లో పుత్తూరు తీసుకొచ్చి అక్కడే గవర్నమెంటు కాలేజీలో చేర్పిస్తే చాలని పోరుతూ వుంది. నాకైతే నీమీద నమ్మకం వుంది మనకేమీ వెయ్యిలోగా కూడా ర్యాంకు వద్దు అమ్మాయిలకు రిజర్వేషనుంది దండిగా కొత్త కాలేజీలొచ్చేశాయి ఫ్రీ సీటు తెచ్చుకో చాలు. ర్యాంకు పదివేలు రానీలే, బాధలేదు."

"బాబాయ్ కొడుక్కి వచ్చే మార్కులు నీకెందుకు రావురా ? నీ దిగుల్తోనే అమ్మ చచ్చేటట్టుంది "

ఇంకెందుకు లెండి !

కొంతమంది పిల్లలకి ఇంటర్‌లో చేరగానే అన్ని భ్రమలూ తొలిగిపోతాయి. ఎంసెట్‌లో సీటైతే రానే రాదనీ, ఫస్ట్‌క్లాస్ వరకూ చాలనీ అనిపిస్తుంటుంది. ఈ మాత్రం చదువు గవర్నమెంటు కాలేజీలో అయినా చదవొచ్చు అనిపిస్తుంటుంది కూడా

జూదానికి అలవాటు పడిపోయిన తల్లిదండ్రులు వాళ్లను బైటికి రానివ్వరు.

ఒక పాప హాస్టల్‌లోగాక మనం వుండకూడదు ఇంటికెళ్లిపోయి నాయుడుపేటలో చదువుకుందాం అనుకుని అడిగింది

"సార్ మూడు నెల్ల ఫీజు పట్టుకుని తిరిగిచ్చేయండి నేను మా వూరెళ్లి పోతాను !"

పాపం అమాయకురాలు! ఏ కాలేజీ వాళ్లయినా వొప్పుకుంటారా ? వాళ్లకు తెలీదా- ఆ అమ్మాయికి ర్యాంకు రాదని! వాళ్లకు డబ్బు వస్తుంది గదా!

ఆ అమ్మాయి చూసి చూసి వొకరోజు ఆయింట్‌మెంట్ తినేసింది. ఇమీడియెట్‌గా హాస్టల్ నించి హాస్పిటల్‌కు! తల్లి దండ్రుల ఉరుకూ పరుగూ!

బుద్ధిమాటలు లక్షలాదిగా...

మళ్లీ హాస్టల్‌లోనే బందీ!

కాలం గడిచి పోతూ ఉంటుంది గదా. ఇంటర్ ఫస్ట్ ఇయర్ పరీక్షలై పోతాయి. ఫలితాలు వచ్చేస్తాయి. ఇక వాతలు మొదలు!

ఎవరికీ తృప్తి వుండదు! 470 కి 440 వచ్చినా ఇంప్రూవ్‌మెంట్‌లు!

ఇంప్రూవ్‌మెంట్ చదువు వొక పక్కా, సెకండియర్ చదువొక పక్కా, ఎంసెట్ కోచింగ్ వొక పక్కా పిల్లల్ని రాక్షసుల్లా పట్టుకుని పిసికి పారేస్తాయి

తీరా ఎంసెట్ రాతకు కూర్చుంటే...

కోడిని కొయ్యడానికి మెడమీద కత్తిపెట్టాక దాని గుండికాయలు ఎంత స్పీడుగా కొట్టుకుంటాయి!

ఎంసెట్ ఫలితాల వెల్లడి !

మెడ తెగిపోతుంది..... .

# కామన్ సెన్స్ లేకే ...!

శ్రీ వెంకటేశ్వరస్వామికి వొక తల్లి ఇట్లా మొక్కుకున్నట్టు నాతో చెప్పింది.

"స్వామీ! రమాపతి కూతురి కంటే నాకొడుక్కి టెన్త్‌లో వొక్క మార్కైక్కు వొచ్చినా నీకొండకు నడిచొచ్చి గుండు కొట్టిస్తా!"

రమాపతి అంటే ఆమె మరిది.

ఈ మొక్కు సంగతి నాతోపాటు అప్పుడే విన్న ఆమెకొడుకు ఇట్లా అన్నాడు.

"అమ్మా బాబాయ్ కూతుర్తో మనకెందుకు చెప్పు? మాధవీకి 210 వొస్తాయి, నాకు 211 వస్తే చాలా అయితే ..!"

నేను వున్న పళాన లేచి వాణ్ని వొంచి వాడి పాపిట్లో ముద్దు పెట్టుకున్నాను, వాడికి వున్న కామన్ సెన్స్‌ను చూసి

పిల్లలకున్న కామన్‌సెన్స్ పెద్దలకు లేకపోవడం వల్లే చిక్కంతా !

మనం ఏపని చేస్తూవున్నా పిల్లలు మనల్ని తప్పే పట్టరు. రిక్షా తొక్కుకుని పొట్ట బోసుకునే ఆయన్ని ఆయన పిల్లలు, "ఇదేం పని నాయినా?" అని ఎగతాళి చేస్తారా?

ఒక క్లర్కు పిల్లలు ఆఫీసర్‌ని చూపించి, "ఆయన్ని చూడు! ఎంచక్కా ఆఫీసరు! నువ్వేమో క్లర్కు! నీకొచ్చే జీతం ధూ నాశనం!" అని పలచన చేస్తారా?

మనం ఏపని చేస్తూవున్నా పిల్లలు మనల్ని ఎంతగానో ప్రేమిస్తారు.

నాకిప్పుడు ఉద్యోగం సద్యోగం లేకుండా ఖాళీగా వున్నాను గదా.

స్కూల్లో నా పిల్లల్ని ఎవరైనా, "మీ నాయన ఏం చేస్తుంటాడు?" అనడిగితే నాకూతురు, "మానాన్న ఇంతకు ముందు ఆంధ్రజ్యోతిలో ఎడిటరుగా చేసేవాడు. (నేను చేసింది సబ్ ఎడిటరుగా) దాన్ని మూసేశారుగదా. Next year తుమ్మలగుంటలో స్కూలు పెడతాడూ!" అని చెప్పుకుంటుందంట

నాకొడుకైతే, "మానాన్న రైటరు. మేం షాపులకు పుస్తకాలేస్తాం. మాకు డబ్బు తౌజండ్స్ తౌజండ్స్ వొస్తుందీ!" అని చెప్తాడంట గొప్పగా.

ప్రేమించడంలోనే గాదు లోకం పోకడ తెలుసుకోవడంలో కూడా మన పెద్దవాళ్లం పిల్లల కంటే భలే Poor

ఒక పిల్లవాడు ఇంగ్లీషు క్వార్టర్లీ పరీక్షల్లో పక్క అమ్మాయి పేపర్లలోంచి ఏదో చూసి రాస్తుంటే సాక్షాత్తూ హెడ్‌మిసెస్ వాణ్ణి పట్టుకుని పేపరు తీసుకుని మధ్యలోనే తరిమేసింది.

వాడు ఏడుస్తూ ఇంటికొచ్చి తప్పును ఒప్పుకోనూ లేదు, చెప్పనూ లేదు

గదా గమ్మునుండి పోయినాడు

ఆ మరసట్రోజు హెడ్‌మిసెస్ వాడి తల్లిని పిలిపించి, "మీవాడు అస్సలు లాభం లేదు. దొంగ కూడా అయిపోతున్నాడు పెంపకం అస్సలు సరిలేనట్టుంద" ని ఉతికేసింది

ఆ రచ్చ అణిగిపోయాక పిల్లాడు చెప్పాడు. ఎంత గొప్పమర్మమో!

"మా హెడ్‌మిసెస్ లంజాముండకి భలే బడాయి. ఆమె strict అని Parents ముందు drama లు వెయ్యాల గదా. అట్లా strict అని అనిపించుకో బట్టే parents అడిగినంత డొనేషన్లు కట్టి పిల్లల్ని చేర్పించేస్తున్నారు ఇప్పటికి 4 బిల్డింగుల్ని కట్టేసింది మా హెడ్‌మిసెస్".

Strict గా వుండడమే ఆమె బిజినెస్. parents ఫోన్‌కాలులు చేసి మరీ ఆమె strict ను గురించి చెప్పుకుంటారు గదా

ఒకసారి కార్పొరేట్ కాలేజీకి వెళ్లి వుండి నోటీసుబోర్డు చూస్తున్నా. దాంట్లో స్టేట్ ర్యాంకు 3 వచ్చిన అబ్బాయిని రంగుల్లో ముద్రించి వున్న 3లో వొయ్యారంగా కూర్చోపెట్టి వున్నారు

New comers ఆరాధనగా చూస్తున్నారు. అందులో ఒక అమ్మాయి, "పెద్ద ఫోజులేవే! ఫస్ట్ టైం గాడిదకి మూడు వేలొచ్చిందట ర్యాంకు. 3సార్లు long term లు తీసుకుని జనగణమన పాడితే ఎవడికి రాదు?"

అర్ధమయ్యింది గదా !

ఈ కాలేజీవాళ్లు చేసే మాజిక్కులకు మనం ఎంత లోబడిపొయ్యామో! ఏటా వెయ్యికోట్లకు జరిగే ఈ ఎంసెట్ వ్యాపారంలో చక్కగా భాగస్వాములై పోయాం

వంద ఇళ్లుండే పల్లెటూళ్లకు కూడా బ్రోకర్లు కార్లు వేసుకుని వెళ్లిపోతున్నారు

"టెన్త్‌లో 2nd class వొచ్చినా ఏం పర్వాలేదు, Inter లో pickup అయి పోతాడేమో! చెప్పలేం. అదృష్టాన్ని పరీక్షించుకోండి !" అంటూ రైతుల దగ్గిర లక్ష వసూలు చేసేసి ముగ్గురు పిల్లల్నయినా పట్టుకొచ్చి చేర్పించేసి కమీషన్లు తీసుకుంటున్నారు.

పిల్లల చదువులకోసం ఐదెకరాల్ని రెండెకరాలు చేసుకున్న రైతులు నాకింతమంది తెలుసు! చిన్నప్పట్నించీ హాస్టళ్లల్లో పెట్టి చదివించినా ర్యాంకు 30, 40 వేలకు పైమాటే!

Lower Classes లో చదువు ఎలా వుందో చాలా చూశాంగదా 15 ఏళ్ల వయసులోనే గుండెకు రంధ్రాలు పడిపోయిన వాళ్లనెందుకు పందెంలో పెట్టి పరిగెత్తించడం !

చదువు వేరూ, డబ్బు వేరూ చదువుకున్నోళ్లంతా డబ్బు సంపాయించే స్తారనీ, ఇంజనీర్లూ డాక్టర్లూ కానివాళ్లంతా హెర్క్యులస్ సైకిళ్లు తొక్కు కుంటూ జీవనం కోసం ఆపసోపాలు పడుతుంటారనుకుంటే అది అపోహే !

అందుకు నేనే ఉదాహరణ.

మీ భాషలో నేను M Sc , Maths దాకా చదువుకున్న విద్యాధికుణ్ణి. కానీ నా వూరి భాషా, చివరికి నాపెళ్లాం భాషా వేరే!

నేనొక పనికిమాలిన చెంగణ్ణి !

20 వేల రూపాయల చీటీ వొకటి-ఇంక నాలుగు నెల్లే వుంది పూర్తవడానికి, chit owner నన్ను పాడనివ్వలేదు. కారణం - నెల జీతం రాని నేను మిగతా నెలలు ఎట్లా కడతాననుకున్నారు ?

ఆ చీటీ చాకలోళ్ల సాలమ్మ పాడి జబర్దస్తీగా డబ్బు తీసుకుంది ఆమె భర్త తిరుపతిలో నాలుగు వీధులూ తిరిగి బండి మీద గుడ్డలు తోమి దినానికి 150 సంపాయిస్తాడు

మొన్నటికి మొన్న తిరుపతిలో వొక డాక్టరుకు పట్టిన గతి చూడండి.

డాక్టరు పాపం ఎంసెట్లూ అదీ ర్యాంకు తెచ్చుకుని మెడికల్ కాలేజీలో మెడిసిన్ చేశాడు గదా చిన్న clinic తెరిచాడు Equipment కోసం రోజూ 300 రూపాయలు కడతానని ఒకడి దగ్గర 50 వేలు అప్పు తీసుకున్నాడు, 5రూపాయల వొడ్డీకి

ఏముందీ, నెల దాకా చూసినా డాక్టరు clinic సరిగ్గా జరక్క కట్టలేక పోయా డంట.

ఇందాకా వొకడు అన్నానే ఆ వొకడు మీ డాక్టరును మీ భాషలో పిచ్చకొట్టుడు కొట్టాడండీ

ఆ వొకడు పదో తరగతి fail అయినవాడు. 20 ఏళ్లుగా 5రూపాయల వొడ్డీ వ్యాపారం చేస్తూ మూడిళ్లు కట్టుకుని దర్జాగా బతుకుతున్న వాడు.

మా fail candidate మీ ranker ని కొడితే dentist దగ్గిరికి పోయి పళ్లు కట్టించుకున్నాడండీ !

మా వూళ్లో కూడా టెన్త్ fail అయిన వాళ్లు కొందరు ఆ వ్యాపారం ఈ వ్యాపారం చేసి బాగా సంపాయిస్తూ ఈ కంఠస్తం చదువులగాణ్ణి చూసి నవ్వుతున్నారండీ!

మద్యనిషేధం అమల్లో వున్నప్పుడు మా బంధువొకడు భలే మహరాజయ్యాడండీ. నేనీ chapter రాస్తుండగానే మా ఇంటికొచ్చి దయతో, “సుబ్రమణ్యం మొహమాటం ఏం వొద్దు. నీ పరిస్థితి తెలిసి అడుగుతున్నా

వెయ్యో, రెండువేలో కావాల్సుంటే అడుగు నా దగ్గిర పనికి ఆహారం పథకం కింద వచ్చిన బియ్యం దండిగా వున్నాయి రెండు మూటలు తెచ్చుకో. రేషన్ బియ్యం అనేమీ బాధ పడొద్దు మన పరిస్థితులకు తగ్గట్టు పోవాలి". అని ఎన్నో సలహాలు ఇచ్చాడండీ ! అంతటివాడు మా ఇంటి కొచ్చినందుకు నా పెళ్లానికి వొంటిమీద చీర నిలవలేదండీ. "మొగోడంటే అట్లా వుండాలి. నువ్వూ వుండావు దేనికి? గంగ జాతరకు నరకనా?" అని ఎత్తి పొడిచి, కేజీ skinless chicken తీసుకురమ్మని నన్ను బజారుకు పంపించిందండీ !

కాబట్టి పిల్లలు చదువుకుని ర్యాంకులు తెచ్చుకోకపోతే వాళ్ల భవిష్యత్తు ఏమై పోతుందో అని ఆందోళన చెందే లక్షలాది తల్లిదండ్రులారా ! మీ ఆందోళన కాస్తా కట్టి పెట్టండి.

ఎందుకు డబ్బును మంచినీళ్ల మాదిర్తో ఖర్చుబెట్టి ప్రతిబిడ్డనూ, ఎంపీసీ బైపీసీ చేర్పించి లాంగ్‌టర్మ్‌లు పెట్టించి పేమెంట్‌లు కట్టి గసపోస్తారు ?

మీదగ్గర ఉన్నదేదో వాళ్లకుండనివ్వండి.

పిల్లలు పెద్దయ్యాక ఏం బతకలేకుండా పోరు. మనలాగే వాడికీ వీడికీ టోపీపెట్టి ఆమోసం ఈమోసం చేసి మనకంటే మంచి బతుకే బతుకుతారు మీక్కావాల్సింది వాళ్లు లక్ష చేతులతో సంపాయించడమే గదా..

ఎన్టీరామారావు ఈ పాటికి ఎక్కడో పుట్టి పెరగతానే వుంటాడు. మళ్లీ ముఖ్యమంత్రి అవుతాడు. మద్యనిషేధాన్ని విధిస్తాడు. అప్పటికి మన పిల్లలూ పెద్దవాళ్లయిపోయి వుంటారుగదా, కాపుసారా కాయించి వొక విడత మహారాజులై పోతారులెండి

అంతగా కాకపోతే 5రూపాయలేం ఖర్మ బీదా బిక్కికి 10 రూపాయలకీ 20 రూపాయలకీ కూడా వొడ్డీలకు మార్చి మిద్దెలు మేడలు కట్టుకుంటారు. కనీసం ఒక రాజకీయ నాయకుడి ముందైనా జై జై అంటూ తిరిగి వెనకన దొంగనోట్లు మార్చి కోటీశ్వరులై పోతారు.

మీరు నిశ్చింతగా వుండండి.

మనం చచ్చిపోయాక మనమీద పడి మన బిడ్డలు ఏడిస్తే కదా మన శవాలు సంతోషించేది !

ఈ లోగానే మనం తొందరపడిపోయి మన కళ్ల ముందే పిల్లల్ని చంపుకునేసి వాళ్ల శవాల మీద పడి మనం ఏడ్చెయ్యడం తప్పు గదా!



వందమందిని తీసుకుని ఈ ప్రశ్నపత్రం ఇచ్చి చూడండి.

(1) 5 -- 3 =

(2) 3 -- 5 =

(3) -- 5 + 3 =

(4) subtract 3 from 5

(5) subtract --3 from 5

పైకి తీసివేతలే కదా అనిపిస్తాయి కానీ ఈ తీసివేతల్లో ఎంత వుందో చూడండి.

పిల్లలు గానీ 5వ తరగతివరకూ చదువులు చెప్పే టీచర్లుగానీ అయిదు నిమిషాల్లో ఈ ప్రశ్నపత్రాన్ని పూరించి ఇచ్చేస్తారు గానీ ఎంతమంది ఎన్నిరకాల ఇబ్బందులు పడి తప్పులు చేస్తారో చూడండి

5--3, 3--5 పిల్లల్ని ముద్దులు పెట్టి చెప్పాల్సిన విషయాలు చాలా వున్నాయి..

(1) 5--3

అంకె 5 ముందు ఏ గుర్తూ లేదంటే అర్థం + గుర్తు వున్నది. + గుర్తు అంటే మన దగ్గర వున్నదని అర్థం

పిల్లవాడి దగ్గర 5 మిఠాయిలు వున్నాయి. --3 అంటే ఆ పిల్లవాడు 3 మిఠాయిల్ని తినేశాడు, లేదా చెల్లికి ఇచ్చేశాడు. 2 మిగిలాయి.

(2) 3--5

దీనికి గూడా పిల్లలు 2 అనే సమాధానం చెప్తారు గానీ కాదు గదా. మనం చెప్పాలి.

+ 3 అంటే 3 మిఠాయిలు పిల్లవాడి దగ్గర వున్నాయి. --5 అంటే 5 మిఠాయిలు వాడు స్నేహితుడికి ఇవ్వాల్సింది. వున్న మూడూ ఇచ్చేస్తే తర్వాత ఇంకా 2 ఇవ్వాలి. బాకీ కాబట్టి --2.

ఇదీ చెప్పి ఇంకా చెప్పాలి.

3-5లో పెద్ద అంకెకు ముందు వున్న గుర్తు --. 5లో 3 పోతే 2. --గుర్తును 2 ముందు పెట్టు. --2. పెద్ద సంఖ్యలోనుంచి చిన్న సంఖ్యను తీసేసి పెద్దదాని ముందున్న గుర్తు పెట్టాలి.

5 --8 = --3

7 -- 10 = --3

10 -- 13 = --3 ఇట్లా

(3) --5 + 3

ఇదేం తీసివేత అనిపించేటట్లున్న తీసివేత. పైదీ, ఇదీ రెండూ వొకటే. ఆ విషయం చెప్పకపోతే పిల్లలకు ఏం తెలుస్తుందీ?

తీసివేతల్లో ఎప్పుడూ కూడా + గుర్తు వున్నదాన్ని ముందు రాసుకుంటే సరి.

(4) Subtract 3 from 5

5లో నుంచి 3ను తీసెయ్యండి.

5 -- 3 లేదా

```
  5
  3
--___
  2
 ___
```

ఇది సరే. మరి (5) subtract - 3 from 5

దీనికీ పిల్లలు రెండు అని జవాబు చెప్తున్నారే! ఆ confusion ఎక్కణ్నుంచి వొచ్చింది?

```
   5
-- 3
_____
_____
```

5లో నుంచి -- 3 ను తీసివెయ్యమన్నారు గాబట్టి 5 కింద -- 3 ను రాసుకున్నాం.

ఇంతకుముందు 5లో నుంచి 3ను తీసెయ్యమంటే

```
  5
- 3
_____
  2
_____
```

ఇట్లా చేశాంగదా. తీసివేయమనగానే + 3 కాస్తా --3 అయ్యింది.

```
ఇప్పుడు        5
             -- 3
             _____
```

ఇంతకుముందు 3ను తీసేశాం. ఇప్పుడు --3ను తీసేస్తున్నాం.

ఇంతకుముందు + 3 కాస్తా --3 అయినట్టే ఇప్పుడు --3 కాస్తా + 3 అవుతోంది.

ఇట్లా 5
-- 3
+
―――
8
―――

తీసివేత అనగానే గుర్తును మారుస్తాం గదా. మర్మాలు ఇంత ఇదిగా వున్నాయి. కాబట్టే పిల్లలకు పదేపదే చెప్పాలనేది. ఇన్ని జాగ్రత్తలు ఏ text book లోనూ చెప్పరెందుకనో! text books భాష బిగించుకుని వున్నట్టు వుంటుంది. పిల్లలు చేసే తప్పుల్ని కూడా ఎత్తి చూపుతూ తమాషగా రాయవచ్చు గదా! కనీసం lower classes books అయినా -

ఈ రోజు పిల్లలకు తీసివేతలు చెబుతాం అన్న టీచర్‌కు ఆ రాత్రి ఇంత home work వుండాలి. అట్లా గాకుండా ఏదో తీసివేత అన్నట్టు చెప్పేసి చేతులు కడుక్కుంటే పిల్లలు మెరికలెలా అవుతారు?

ఒకరోజు నేను హైద్రాబాద్‌లో వుండగా వొక స్కూల్ ఫంక్షన్‌లో నేను ఐఐటి రామయ్య ఉపన్యాసాన్ని శ్రద్ధగా విన్నాను.

ఆయన subject మీద horizontal expansion వుండాలి గానీ, vertical కాదు - అన్నారు ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. horizontal అంటే తెలుసు, vertical అంటే తెలుసు కానీ విషయం నాకు అర్థం కాలేదు ఒక మేధావి మాటలు కూడా అర్థంకాని బోగస్ మేధావిని నేను

పనిగట్టుకుని సంజీవరెడ్డినగర్‌కెళ్లి వొక కార్పొరేట్ కాలేజీలో సీనియర్ లెక్చరర్ ఇంటర్‌వ్యూ తీసుకుని ఆయన్ని అడిగాను ఆ సార్ నాకు అర్థమయ్యేటట్టు చెప్పినాడు

Horizontal expansion ఇప్పుడు Algebra లో Bases and Powers అన్న chapter తీసుకోండి అందులో ఏ ఫార్ములా ఎందుకొచ్చింది, ఆ ఫార్ములాల మీద Text book లో వున్న ప్రశ్నలేగాక ఇంకా ఎన్నిరకాలుగా అడగవచ్చు... ఇట్లా ఆ chapter ను అడ్డంగా expand చేసుకోవడం అదే తరగతిలో వుండి.

Vertical expansion Text book లో వున్న problems ను హడావుడిగా అయిపోజేసి 7వ తరగతిలోనే ఆ chapter కు సంబంధించిన ఎనిమిదో తరగతి లెక్కలూ, 8లోనే 9వీ, 9లోనే 10వీ, 10 లోనే ఇంటర్‌వీ చేయించేసి పిల్లల్ని

గానుగెద్దుల్ని చేసేయడం.

అంతేగదా. మూడో తరగతిలోనే తీసివేతలు 18,776-9,687 వేయించేసి తీసివేతలన్నీ చెప్పేశామనుకుని గాభరాగా గుణకారాల్లోకీ, భాగహారాల్లోకీ తరుముకుపోవడం - vertical expansion అంటే.

ఆయన ఉపన్యాసం విన్న తర్వాత నేను నాలుగు రోజులు తీసివేతల మీద కూర్చుంటే - నాకు ఇన్ని చిక్కులు కనిపించాయి.

పిల్లలకొచ్చే డౌట్లు పరమన్యాయంగా వుంటాయి. నేను హైద్రాబాద్‌లో ఒకటిన్నర నెల వొక స్కూల్లో చేశానని చెప్పాను గదా

అక్కడొక టెన్త్‌క్లాసమ్మాయి నన్ను పట్టుకుని ఇట్లా అడిగింది .

"ఏమండీ మాస్టారూ ! $\frac{a+b}{2}$ అనేది $\frac{a}{2}+\frac{b}{2}$ అయినప్పుడు $\frac{ab}{2}$ మాత్రం $\frac{a}{2}\frac{b}{2}$ ఎందుక్కాదండీ?"

"లంజాముండా! టెన్త్ చదవతా ఇదా నువ్వడిగేది" అని కసిరేసి వుంటే ఆ పిల్ల మూతి నల్లగా పెట్టుకుని కూర్చునేసేదే!

నాకెంత సంతోషం వేసిందో చెప్పలేను నా మొహం చూసి - ఏ డౌట్‌వొచ్చినా వీణ్ణి అడిగేయొచ్చు అని ఆ తల్లికి అనిపించిందంటే యస్ నా మొహంలో కళ వుందీ!

నేనిట్లా చెప్పినాను.

"చూడమ్మా! ఈ పనికిమాలిన aలనూ, bలనూ వొదిలిపెట్టు అంకెలు మనకు బాగా తెలుసుగదా. $\frac{10+8}{2}$ ఎంత?

బై టు అంటే సగం గదా. 18లో సగం 9. $\frac{10 \times 8}{2}$ ఎంత? 80లో సగం 40 కదా.

$\frac{10+8}{2}$ ను తీసుకో $\frac{10}{2}=5$ కదా, $\frac{8}{2}=4$ కదా

ఆ రెంటినీ కూడితే 9 కదా. $\frac{10 \times 8}{2}$ ను తీసుకో

$\frac{10}{2}=5$ కదా, $\frac{8}{2}=4$ కదా, $5 \times 4 = 20$ కదా . ... "

నన్నింక ఆ పాప చెప్పనివ్వలేదు. ఎప్పుడైతే a, bలను వొదిలి పెట్టి అంకెల్లోకి దిగానో అప్పుడే ఆ పిల్ల మొహం తెలివితో వెలిగిపోయి, "సార్‌సార్ సారీ సార్.

సిల్లీ కొశిన్ వేశాను.” అంది.

Maths లో నా calibre కూడా ఆ పాప అంతదే. ప్రతిదీ కళ్లాపి జల్లి ముగ్గేసినట్టు తెలుసుకోకపోతే మనశ్శాంతి వుండదు

అందుకే నేననేది ఏమంటే - స్కూలు టీచరు నిరంతరం హోంవర్కు చెయ్యాలి. ఆయనేం పార్లమెంటు సభ్యుడుగాదు చేతులూగించుకుంటూ దాంట్లోకి వెళ్లిపోవడానికి. టీచరు!

కనీసం 30 ఏళ్లు వరసగా చెప్తుంటారు గాబట్టి తొలి 2,3 సంవత్సరాలు సబ్జెక్టు మీద కూర్చుని దాన్ని వొంగదీసి దాంతో పిల్లలు పడే ఇబ్బందినంతా చూసి .. పిలకాయల ముందర ప్రతి లెక్కనీ దద్దమ్మను చేసిపెట్టి వొదలాలి.

7th classలో వొక పిల్లవాడు వొక లెక్కను ఇట్లా చేశాడు.

$$1000\frac{1}{2} \times 999\frac{1}{2}$$

$$1000\frac{1}{2} = 1000 + \frac{1}{2}$$

$$999\frac{1}{2} = 1000 -- \frac{1}{2}$$

$$1000\frac{1}{2} \times 999\frac{1}{2} = (1000 + \frac{1}{2})(1000 -- \frac{1}{2})$$

$(a+b)(a-b) = a^2 -- b^2$ అనే ఫార్ములాను బట్టి

$$(1000 + \frac{1}{2})(1000 -- \frac{1}{2})$$

$$= (1000)^2 -- (\frac{1}{2})^2$$

$$= 1000 \times 1000 -- \frac{1}{2} \times \frac{1}{2}$$

$$= 10,00,000 -- \frac{1}{4}$$

$$= \frac{10,00,000}{1} -- \frac{1}{4}$$

$$= \frac{40,00,000 -- 1}{4}$$

$$= \frac{39,99,999}{4}$$

4 ) 39,99,999 ( 9,99,999 75
36
39
36
39
36
39
36
39
36
39
36
30
28
20
20
0

చూడండి. బిడ్డ ఎంత ఆయాస పడ్డాడో! వాడు చేసిందాంట్లో రవ్వంత కూడా తప్పులేదు. గస.

వాడి సమస్య పదిలక్షల్లోంచి 1/4 ను తీసెయ్యడం. శాస్త్రప్రకారం చేస్తే అంతే L C M.. తీశాడు. పదిలక్షలు కాస్తా 40 లక్షలయ్యింది. దాంట్లోంచి వొకటి తీశాడు. 39,99,999 అయ్యింది. పద్ధతిప్రకారం 4తో భాగించాడు.

కాసేపు బోర్డుమీద నుంచి చూపును వీధిలోకి మరల్చి చూస్తే నాకు అర్థమయ్యింది.

ఇట్లా చెప్పాను.

"చూడురా. వెయ్యి రూపాయలు నీ జేబులో వుంది. పావలా పెట్టి గోళీ గుండు కొనాలి. నువ్వు రూపాయే కదా, జేబులో నుంచి తీస్తావు. వెయ్యి కుమ్మరించవు గదా. 999 రూపాయలు జేబులోనే వుంచి రూపాయ ఇస్తావు కొట్టువాడు పావలా తీసుకుని నీ ముప్పావలా నీకిస్తాడు. 999తో వెళ్ళి ఈ ముప్పావలా చేరుతుంది. నీ దగ్గర 999 3/4 వుంటుంది. అంతే గదా.

10 లక్షల్లోంచి 1/4ను తీసెయ్యడమన్నా అంతేగానీ ఇంత కష్టం పడాల్సిన పన్లా 9,99,999ని అట్లావుంచి వొకట్లోంచి పావలా పోతే 3/4 మిగుల్తుంది గదా. నోటి లెక్క అన్నమాట చెయ్యి పెట్టాల్సిన పనేలేదు."

పిల్లలంతా ఎంత హాయిగా వూపిరి పీల్చుకున్నారో!

ఆ తర్వాత 100½ x 99½ మొదలు అన్నీ సులభమైపోయాయి.

**చి**న్నప్పుడు నేను అడవికి గొడ్లను తోలుకుపోయేటప్పుడు పేడ తెద్దామని

కూడా తట్ట తీసుకెళ్లే వాణ్ణి.

అడివిలో అన్ని వూళ్లవాళ్లూ గొడ్లను తోలుకొస్తారు గదా. సాయంకాలానికంతా తట్ట నిండిపొయ్యేది.

నేనా! లేదర బిడ్డను. అంత తట్టను ఎట్ట మోద్దును?

ఏదో ఒకరకంగా నెత్తిన పెట్టుకుని వొస్తావుంటే ఆ బరువుకు గుండెల్లో నెత్తురు దిగినట్టుండేది కనుగుడ్లు పొడుచుకొచ్చేవి.

దోవలో ఎదురుపడే పెద్దోళ్లకు మనసే వొప్పేదిగాదు. ఆడా మగా మార్చి మార్చి మా దిబ్బదాకా నా తట్టను మోసుకొచ్చి ఇచ్చేవారు.

వేలాదిమంది టీచర్లు ఇక్కడే ఆలోచించాలి. బిడ్డలు హద్దుమాలిన బరువులు మోస్తున్నారు.

మనం టీచర్లం వాళ్ల నెత్తి బరువును నేలదించాలి గదా. మనం నెత్తికెత్తు కోవాలి గదా.



# ఇంటర్‌లో ఏం జరుగుతోంది ?

పిల్లల్ని ఇంటర్‌లో చేర్చడం అంటే - బిడ్డల్ని బావుల్లో వేసి లోతులు చూడ్డమే!

అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నప్పుడల్లా దురదృష్టమే ఎదురవుతుంటుంది.

చచ్చిపోయిన ప్రపంచ తత్వవేత్తలూ, ఇప్పుడు బతికున్న మనస్తత్వ శాస్త్రవేత్తలూ అంతా కట్టగట్టుకుని రావాల్సిందే - ఇంటర్ చదివే పిల్లల తల్లిదండ్రుల మెంటాలిటీని అసెస్ చెయ్యడానికి మనవల్లా కాదు

ఇళ్లు కట్టిన వాళ్ల మాటలు వింటూవుంటారు గదా "ఏందోనండీ 4 లక్షలు పెట్టుకుని దిగితే గృహప్రవేశం నాటికి ఆరు లక్షలు లెక్క తేలింది." అంటుంటారు బడాయిగా.

ఇల్లు మళ్లీ మళ్లీ కట్టుకోం గదా టైల్స్ లేకుంటే ఏం బాగుంటుంది, టేకు కొయ్య లేకుంటే ఏం బాగుంటుంది, గోడల్లోనే షోకేసుల్లేకుంటే ఏం బాగుంటుంది - ఇది గదా వరస.

పిల్లల్ని కూడా మళ్లీ మళ్లీ చదివించం గదా ఇంటర్లో బైపీసీనో ఎంపీసీనో చదివించేద్దాం! ఏమో వాళ్లరాత ఎట్లా వుందో! ఒకవేళ ఎంసెట్‌లో ఫ్రీసీటు రావచ్చేమో!

ఇంట్లో ఫ్రిజ్జూ, టీవీ లేకుంటే ఎంత నామోషీనో టెన్త్ అయిన పిల్లల్ని ఇంటర్‌లో సైన్స్ గ్రూప్‌లో చేర్చకపోతే అంత అవమానం

నువ్వు చేర్చావని నేనూ, నేను చేర్చానని నువ్వూ!

పిల్లల్ని కూడా ఎట్లా తయారు చేశామంటే, "ఏంరా! ఏం చేరాలను

వుండలేక పొయ్యాను.

మామూలుగా నేనేదైనా పుస్తకం రాసేటప్పుడు ముందు టైటిల్-ఇదీ-అని అనుకోందే రాయలేను. ఈ పుస్తకానికి 'పద్మవ్యూహంలో పిల్లలు' అని టైటిలు పెట్టుకున్నాను గానీ అది నాకే నచ్చలా ఈ టైటిలు అని అనుకున్నంత సేపూ నేను పుస్తకాన్ని మొదులే పెట్టలేక పొయ్యాను.

నా దగ్గిరికి Trigonometry చెప్పించుకునే దానికి టెన్త్ చదివే ప్రీతి అని ఒక పాప (వాళ్ళది మా పక్కూరు గంగిరెడ్డిపల్లి) వచ్చింది.

ఆ పిల్లతో చెప్పాను - ఇట్లా మీరు ఇంట్లో, స్కూల్లో, ఈ చదువుల్తో పడే కష్టాలన్నీ వొక పుస్తకంగా రాయాలనుకుంటున్నానమ్మా - అని. అప్పుడు "అంకుల్, దానికి పద్మవ్యూహంలో పిల్లలు అని నువ్వు పెట్టిన టైటిల్ బాగా లేదు చదువులా? చావులా?? అని పెట్టి రాయి." అని తడుంకోకుండా చెప్పింది ప్రీతి.

ఈ పుస్తకం కథ కనీసం 50 మంది పిల్లలకు చెప్పివుంటా. అందురూ, "చదువులా? చావులా? అనే టైటిలే పెట్టు అంకుల్!" అన్నారు.

చదువుల్ని పిల్లలు ఎట్లా చూస్తున్నారో తెలిసింది గదా!

ఇంక వాళ్ళు పెట్టిన టైటిల్ కింద నేను పుస్తకం మొదలు పెడతా...

# పిల్లల మీద తల్లిదండ్రుల మోజు

రకరకాల నూకలు పోసి కోడిపుంజును ఎవరైనా ఎందుకని సాకుతారు?

భోగిపండుగ రోజున కత్తిగట్టి - నువ్వు చావనైనా చావు, లేదంటే వేరేవాళ్ల పుంజును చంపుకోనైనా రా - అనేసి పందెంలో వొదలడానికి,

గెలిచొచ్చిన పుంజును చంకలో పెట్టుకుని, అది వోడగొట్టి తెచ్చిన పుంజుకు మసాలా పెట్టి పండగ చేసుకోవడానికి,

ఇప్పుడు పిల్లల నుంచి తల్లిదండ్రులు ఏమి ఆశిస్తున్నారు - అనే దాని గురించి గదా నేను మాట్లాడుతుండేది! దీనిమీద మీకు కండ్లకు కట్టినట్టు చెప్పాలంటే - నా కండ్ల ముందు జరిగినవన్నీ పూసగుచ్చినట్టు చెప్పేయడమే మార్గం!

మూడేండ్లు కట్టికట్టి రాసినా ఇంటర్మీడియట్ ఇంగ్లీషు పాసుకాలేక చదువునొదిలేసిన వాడొకడు పెండ్లి చేసుకుని వొక బిడ్డకు తండ్రయిపోయినాడు.

వాడు వాడికొడుకు గురించి ఇట్లా ముచ్చటించాడు

"మావాడు సెవెన్త్. ఫర్వాలేదు మొన్న క్వార్టర్లీకి క్లాసులో 4th rank వచ్చాడు 'చూడ్రా! 40 మంది వున్న క్లాసులోనే నువ్వు నాలుగో ర్యాంకు వస్తున్నావు కానీ రేపు ఇంటర్ ఎంసెట్‌లో లక్షమందిలో ఎన్నో ర్యాంకు వొస్తుందో నువ్వే ఆలోచించు.' అని మంచిగా చెప్పి చూస్తున్నాను చూడాలి ఏం చేస్తాడో!"

అయిదేళ్ళ తర్వాత జరగబోయే కథకు - ఇప్పణ్ణించే కత్తి నూరడం!

నాకు బాగా అనుభవంలోకి వచ్చిన మూడు కుటుంబాల కథ చెప్తా

(1) ముందు మా కుటుంబం -

ఇక్కడ మా స్థితిగతుల గురించి కొంత చెప్పుకోవాలి.

నేను 15 సంవత్సరాలుగా ఆంధ్రజ్యోతి పేపరాఫీసులో ఉద్యోగం చేస్తుండేవాణ్ని. దాని పరిస్థితులు బాగలేక సంవత్సరంగా అది మూతపడి పొయ్యింది నెలబెట్టే కొందికి 8 వేలు వస్తా వుండడంతో అప్పుడు జల్సాగా వుండింది ఆ ఆదాయం పోవడంతో మాకు చెయ్యి విరిగినట్టయిపొయ్యింది

40 ఏండ్ల వయసు చదివిన చదువుకు వుద్యోగం వచ్చే ఇదిలేదు ఏదోవన పోవాలో తెలవక - కొంచం ఇబ్బందిగానే వుంది

నాకు ఇద్దురు పిలకాయలు. మా అక్క కూతుర్ని కూడా నేనే సాకి సంతరించాలి. దీంతో మాకు, మరీ ముఖ్యంగా నా భార్యకి 'టెంషం'గా వుంది.

ఇంత చీకట్లో కూడా నా భార్యకొక వెలుగు చుక్క కనిపించి ఏడుకొండలూ, ఏడేడు పద్నాలుగు సముద్రాలూ అంత ఆశ పెట్టుకునేసింది.

ఆ ఆశ నా కూతురి మింద!

ఎవురు ఇంటికొచ్చినా నా కూతురు దీప్తిని చూసి, "పాప మంచి క్లవరు. బాగా చదివించుకోండి." అని చెప్తా వుంటారు

"ఈ కాలంలో పిల్లలే ఆస్తి. మనం రైల్లో పోతున్నామనుకో, పక్కనుండే వాళ్ళు మీకు సొంత ఇల్లు వుందా? భూమి ఎన్ని ఎకరాలుంది? బ్యాంకీలో ఎంత కట్టిపెట్టారు - ఇట్లాంటివెవరూ అడగరు. పిల్లలెంతమంది? అంటారు. చెప్తాం ఏం చదువుతున్నారని అడగతారు అప్పుడు మనం మొన్ననే ర్యాంకు తెచ్చుకుని మెడిసిన్‌లో జాయినయ్యిందని చెప్పామనుకో మనకు ఎంత మతింపు? ఎంత హోదా! ఒక లెక్కలో చూస్తే ఇప్పుడు పిల్లలే మనకు ఆస్తి వాళ్ళను బాగా చదివించేస్తే చాలు. అదే వాళ్లకు మనం ఇచ్చేది ." ఇట్లాంటి వుప్పుకీ వూరగాయకీ పనికిరాని మాటలు అందర్లాగే నా భార్య కూడా బాగా వినేసి వుంది

దాంతో నా భార్య గంపడేసి కళ్ళూ - నా కూతురి మీద పడిపొయ్యాయి

దీప్తి ఇప్పుడు తొమ్మిది చదువుతోంది. వాళ్ళమ్మ దీప్తితో అప్పుడప్పుడూ ఏం ఖర్మ, దినానికి నాలుగుసార్లు ఇచ్చే ఉపన్యాసాల్లో కొన్ని మాటలు:

"చూడు దీదీ! నీ అబ్బుడు నీకేం సంపాయించి పెట్టలేదు. వాడి కడుపున ఎప్పుడైతే పడ్డారో అప్పుడే మీరు దరిద్రులై పొయ్‌నారు. అది గుర్తుపెట్టుకో. ఏ ఆటో వొక ఆట ఆడి పదో తరగతి దాకా చదివించే ఇది నాది. ఆ తర్వాత

నేను గాదు గదా నిన్ను పుట్టించిన బ్రహ్మదేముడు కూడా నిన్ను చదివించలేడు నీ చదువు నువ్వే చదువుకోవాలి ''

దీనికి నా కూతురు, ''మీరు చదివించకపోతే ఇంకెవురు చదివిస్తారమ్మా! పెద్దోళ్లు ఫీజులు కడితేనే కదా పిలకాయలు చదువుకునేది!'' అని అంటుంది.

అప్పుడీమె, '' అదే గదా చెప్పేది! చెప్పేది పూర్తిగా వినకుండా దూరితే ఎట్లా? స్కూల్లో కూడా ఇట్లనే చేస్తున్నావా? ఇప్పుడు నైన్త్. నెక్స్ట్ ఇయర్ టెన్త్ టెన్త్‌లోనే గాకుండా ఇప్పణ్ణుంచి కష్టపడినావనుకో ఫైవ్‌ఫార్టీ తెచ్చుకుంటావు. 540 తెచ్చుకుంటే ఇంటర్‌లో ఏ కాలేజీ కూడా ఫీజులు తీసుకోదు. వాళ్లే నిన్ను హాస్టల్లో పెట్టుకొని ఫ్రీగా చదివించుకుంటారు '' అంటుంది

''540 యే గదా. తెచ్చుకుంటాన్లే,'' అని అప్పటికా నస తప్పించుకోవాలని చూస్తుంది దీదీ

మొన్నామధ్య ఇట్లాంటి మాటలు ఇంట్లో జరగతా వుండంగానే స్కూల్లో Quarterly Exams పూర్తయి పొయ్యాయి. ఇంటికి ప్రోగ్రెస్ రిపోర్టు వొచ్చేసింది

ప్రోగ్రెస్ రిపోర్టు వొచ్చిన సంగతి తెలవకుండా నేను ధైర్యంగా ఇంటి కొచ్చినానా.. నా భార్య ప్రభావతి సందిట్లావు గసపోసుకుంటూ, ''ఏమబ్బా! ఈ లంజకి అమెరికాకు విమానం టికెట్టు తీసుకునే యోగం లేదు. అది పూనాకు రైలు టిక్కెటు తీసేసింది'' అని ఆయాస పడింది. (మీరు నిజం చెప్పినా వింటారు అబద్ధం చెప్పినా వింటారు. నిజంగానే ఈ మాట అనింది అక్కసుతో. మూడేండ్లు హైద్రాబాద్‌లో వుండి వచ్చింది కదా ఎవరు చెప్పుకుంటూ వుంటే వినిందో గాని.)

నేను ప్రోగ్రెస్ రిపోర్టు చూసినా.

తెలుగు-60, ఇంగ్లీషు-80, హిందీ-81, లెక్కలు-96, సైన్స్-97, సోషల్-94, టోటల్· 508.

''ఫర్వాలేదులే, బాగానే వచ్చినాయి.'' అని ధైర్యం చేసి అనేశాను.

''అవునూ ఇదే మాదిర్తో టెన్త్‌లో కూడా 500 తెచ్చుకునేసరికి నీలిగి చచ్చిందనుకో. ఇంటర్‌లో రెండేండ్లకూ 50 వేలు ఎక్కణ్ణుంచి తెచ్చి పెడతావు నాయినా! ఇట్లనే వెనకేసుకొచ్చి వాళ్లను కూడా పనికి రాకుండా చేసెయ్ నీకు మాదిరిగానే,'' అని నామిందికొచ్చింది.

నేను ఆడంగుల చెంగణ్ణిగదా వెంటనే ప్లేటు మార్చేసి, ''ఏందమ్మా ఈ మార్కులు? Maths లో 96 అంటే దారుణం. మిగతా నాలుగు మార్కులూ ఏ గాడిదలు కాయను పొయ్‌నాయి? Maths అంటే వందకు వంద

తెచ్చుకుంటే గానీ Life లేదు నువ్వేదో ఉద్ధరిస్తావనుకుంటే వూహు లాభం లేదు . " అని పాపం పుణ్యం లేకుండా మాట్లాడేసినా.

కానిపని చేసిన దానిమాదిరిగా దీప్తి గువ్వమాదిర ముడుక్కుని కూర్చొని వుంది అప్పటికే వాళ్ళమ్మ నాలుగేసినట్టు వుంది.

ఇక్కడ దీప్తి చదువు ఎట్ల సాగిందీ కాసింత చెప్పుకోవాలి.

ఆమె పుట్టింది 1988 ఆగస్టులో అప్పుడు మేం మా మిట్టూరులోనే కాపరం. అందుకని 1994లో తెలుగు మీడియం గవర్నమెంటు స్కూల్లో వొకటో తరగతి చేర్పించాం ఆ స్కూలికి ఆర్నెల్లు పోయిందో లేదో మావూరి బస్సు రోడ్డు దగ్గిర ఎవరో కాన్వెంట్ పెట్టేసరికి ఇక్కడ మాన్పించి అక్కడ చేర్పించాం తర్వాత 95లో మేం కాపరం తిరపతికి మార్చాం. తిరపతిలో ఆ పాపను రెండులో చేర్పించాం రెండూ మూడూ నాలుగూ అదే స్కూల్లో చదివింది.

ఆ పాప నాలుగులో వుండంగానే చూసిన వాళ్లంతా "ఏడా! ఎనిమిదా?" అని అడుగుతుండడంతో నా భార్య, "ఇదేందో కోతి మాదిరిగా పెరిగిపోతా వుంది. దీన్ని 4లో నుంచి వొకేసారి అరులో చేర్పించేద్దాం." అని మళ్లీ స్కూలు మార్చి వేరే స్కూల్లో చేర్పించేసింది

ఆ స్కూల్లో అరోతరగతి మూడు నెల్లు చదివిందో లేదో మాకు హైద్రాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ అయ్యింది. మళ్లీ ఈ స్కూలునుంచి కె.పి.హెచ్.బి. స్కూల్లో ఆరులో చేర్పించాం అక్కడ ఆరూ ఏడూ చదివింది. ఆ స్కూల్లో సెవెన్త్ పబ్లిక్‌లో మా కూతురొక్కటి తప్ప మిగతా పిల్లలంతా చూసి రాసేసి పాసైపోయి, మా అమ్మాయికి ఫస్ట్ ర్యాంకు రాకుండా చేసేశారని ఎయిత్‌లో ఎర్రగడ్డ స్కూల్లో జాయిన్ చేసేసింది.

పాప నైన్త్‌కొచ్చేసరికి ఆంధ్రజ్యోతిని మూసెయ్యడం, మేం అక్కణ్ణుంచి మళ్లీ తిరప్తికి రావడం, తిరపతిలో దీప్తిని మళ్లీ వేరే స్కూలుకు మార్చడం

ఎల్‌కెజి చదవలేదు, యుకెజి చదవలేదు, అయిదో తరగతిని చదవ నివ్వలేదు, ఏ స్కూల్లోనూ తిన్నగా చదవనివ్వలా.

అయినా మా దీదీ Performance అట్లావుందీ అంటే మేం encourage చెయ్యాలి గదా

నా కూతురికి పాపం పెండ్లికాకుండానే సవితి పోరు ప్రారంభమైంది. అదెట్లా అంటే.....

మామూలుగా మనకు తెలియని విషయాల్లో మనం వేలు పెట్టకుండా వుండాలి. కానీ నా భార్య అట్లా కాదు. ఆమె కట్టకింద వెంకటాపురం హైస్కూల్లో

టెన్త్ వరకూ చదివింది యాపిల్ స్పెల్లింగ్ ఎ.పి ఐ.ఎల్ అంట ఒకసారి నా కొడుక్కి చెప్పిస్తూ వుంది. APPLE అంటే అప్లె అంట. నా కొడుకే నవ్వినాడు అయినా సిగ్గురాలేదు.

నా భార్య నా కూతురి చదువులో వేలేగాదు - గున్న ఏనుగులాంటి ఆమె శరీరం మొత్తాన్నీ దూర్చేసింది.

1,200 రూపాయల బాడుగ ఇంట్లో మేం అయిదు మందిమి కాపరం వుంటున్నాం. నా కూతురొక మూల కూర్చుని చదువుకుంటూ వుంటుందను కుందాం. ఈమె మనకెందుకులే అని వూరుకోకుండా పోయి పక్కన కూర్చుంటుంది.

ఒకరోజు బుద్ధిగా, దేవతలకు పుట్టిన బిడ్డ మాదిరిగా బొమ్మలా కూర్చుని చదువుకుంటున్న నా కూతురి దగ్గరకు వెళ్ళి ఈ గున్న ఏనుగు ఇచ్చిన ఉపన్యాసం

"నువ్వు నీ అబ్బ మాదిరిగా మేధావి ఐపొయ్‌నావు. మనసులోనే చదువుకుంటే ఎట్లా సేయ్? లొడలొడా గట్టిగా అరిచి అరిచి చదువుకుంటే నోటికి వస్తుంది. దేన్ని గూడా కంఠస్తం పెట్టెయ్యాలి. అప్పుడు పరీక్షలో అచ్చుగుద్దినట్టు రాసేయొచ్చు. అప్పుడు 5 మార్కులకు 5 మార్కులు పడిపోతాయి. కానీ ఈ కొంపలో చదువు అట్లాగాదు కంఠస్తం పెట్టగూడదు. అర్థం చేసుకుంటే చాలు అని ఆ వెధవ అనడం, నువ్విదే ఛాన్స్ అని పుస్తకాన్ని వొళ్లో పెట్టుకుని పెదాలు కదిలించకుండా గమ్మున కూర్చోవడం. పరీక్షలో సొంతంగా ఏదో వొకటి రాసేసి వొచ్చేయడం కాబట్టే గదా నీకు నూటికి 95, 96లే వొస్తుండేది! ఏరోజైనా నీకు నూటికి నూరు వొచ్చినాయా? 40 మంది వుండే క్లాసులో ఏరోజైనా నీకు మూడో ర్యాంకూ నాలుగో ర్యాంకే గానీ ఫస్ట్ ర్యాంకొచ్చిందా? మర్యాదగా గడగడా గట్టిగా చదువు, పుస్తకాన్ని ఆ మూలనుంచి ఈ మూలకు కంఠతా పెట్టెయ్."

ఈ ఇన్ని మాటలకూ నా కూతురు అప్పుడప్పుడూ నోరు తెరిచి,"తల కాయలు తినొద్దు. Half yearly కి ఫస్ట్ ర్యాంకు తెచ్చుకోకపోతే అప్పుడడుగు. ఇంక వెళ్లు." అంటుంది.

ఈ హామీతో నా భార్య వీరతాపం కొంచెం అణుగుతుంది

"నా అమ్మగదా, నా బుజ్జిగదా, నా కన్నగదా. నువ్వొక్కసారి 540 తెచ్చి ఫస్ట్‌ర్యాంకు అనిపించుకో. నువ్వడుగుతుంటావే excalibre జీన్స్ తీసిస్తా" అని ముదిగారం చేస్తుంది.

ఈ కథ జరిగిన రోజున నా కూతురి మీద వున్న బాధ్యత ఒక్కటే గదా.

అది టెన్త్‌లో 540 వరకూ తెచ్చుకుని ఇంటర్‌లో ఫ్రీగా చదివి 60 వేలు ఆదా చెయ్యడం (అంటే సంపాయించడం)

నెల తర్వాత పది కిలోల బాధ్యత ఒక్కసారిగా 30 కిలోలు అయిపోయింది చూడండి. అది ఇట్లా జరిగింది

దీని బంధువొకామె చిత్తూరునుంచి వొచ్చి గీసిన అగ్గిపుల్ల అది. ఆ పుల్ల నా భార్యలో ఎన్ని మంటలు రేపిందో చూద్దురు గాని-

ఒక రోజు నా భార్య వున్నట్టుండి హిమాలయాలకు నిచ్చెనేసేసి, "దీదీ! నేన్చెప్పినట్టు వింటే నీకు TVS scooty తీసిస్తా టెన్త్ అవ్వగానే-" అనింది.

దీప్తి, "నీకు అంత సీను లేదులే, నువ్వు మూస్తావా?" అనింది

అందుకీమె, "నిజ్జం దీదీ! దేముడి తోడు నీకు టెన్త్ అవగానే TVS scooty తీసిచ్చి తీరతా నాకెట్టా స్కూటర్ వెనకాన కూర్చుని తిరిగే యోగం లేదు. అది వీడ్ని కట్టుకున్నప్పుడే తేలిపోయింది. బిడ్డలకైనా తీసిచ్చి మీ వెనకాన ఎక్కాలని వుందమ్మా నాకు!" అనింది మెత్తగా

దీప్తి తెలివైనది ఈ సమయంలో ఏం మాట్లాడినా అది ఆ పిల్ల మెడకాయకే చుట్టుకుంటుందని తెలిసి గమ్మనుండి పోయింది. అయినా "నాన్నకు తెలియకుండా చీటీగానీ వేశావా?" అనడిగింది.

"అవన్నీ నీకెందుకు? నీకు తీసిస్తా అదే నీక్కావాల్సింది. అయితేనేన్చెప్పి నట్టు చెయ్యాలి." అని వూరించింది

"నీకు 540 తేవాల టెన్త్‌లో అంతే గదా?" అని చూసింది దీదీ.

"రోజుకు పదహారు గంటలు చదువు. Text books అన్నీ ధరో అయ్‌పో. ఒక్క బిట్టుకూడా పోనివ్వద్దు 570 తెచ్చుకో. ఎంత మందికి రావడంలేదు! స్టేట్‌లో కనీసం పదిమందికైనా వస్తాయి. నువ్వు స్టేట్‌ఫస్ట్ తెచ్చుకోకపోయినా జిల్లా ఫస్ట్ తెచ్చుకో 570" అనింది.

ఈ మాటకు దీదీ బిత్తరపోయి, "అమ్మో 570 కేశావా తల్లీ ప్లాను!" అనేసి పుస్తకాల్లో తల దూర్చేసింది

"నువ్వు 570 తెచ్చుకోవాలేగానీ TVS scooty యేకాదు మెళ్లోకి బంగారు గొలుసు కూడా తీసిస్తా..." ఎందుకులెండి కొత్తగా 570 పాట ఎత్తుకునింది వొదిలే పెట్టలేదు.

ఇంతకీ విషయం ఇదీ·

మొన్న చిత్తూరునుంచి వొచ్చిన కమలమ్మ ఇచ్చిన సమాచారం- ఆమె

మరిది కొడుక్కి టెన్త్‌లో 570 వొచ్చినాయంట. వొక కాలేజీ వాళ్లు వచ్చి 'కారెక్కేసెయ్, గుడ్డా గుసురు కూడా మాదే. ఇంజనీరు కావాలంటే ఇంజనీరూ, డాక్టరు కావాలంటే డాక్టరూ చేసి పంపిస్తాం.' అని కుయ్యోమొర్రో అన్నారంట అయినా ఆమె మరిది వాళ్లు తొందర పళ్లేదంట. ఆ మరసట్రోజే ఇంకో కాలేజీవోళ్లొచ్చి 20వేలు కూడా ఇస్తామన్నారంట అప్పుడు మాత్రం ఆమె మరిది వాళ్ళు, "రేపు మంచిరోజు. రేపు రండి. పిల్లోణ్ణి మీతోపాటు కారెక్కిస్తాం "అన్నారంట. ఆ కాలేజీ వాళ్లు రేపు వస్తే ఏముందీ? 50వేలు కమలమ్మ మరిది కాళ్ళమీద పోసేసి నెల్లూరు నుంచి పెద్ద కాలేజీవాళ్ళు పిల్లాణ్ణి కారెక్కించుకోని అపాటికే ఎగరేసుకుపొయ్యుంటే ...

"ఏం వాడికేమైనా కొమ్ములొచ్చినాయా? నీకుమాత్రం ఎందుకు రావు 570 పట్టుదల వుండాలే గానీ-" అని కూర్చునిందీమె

ఈ కథ జరిగిన రోజుటికి నా కూతురి మీద వున్న బరువూ బాధ్యతా టెన్త్‌లో 570 సంపాయించడం, ప్రైవేటు కాలేజీ వాళ్లు మా చుట్టూ తిరిగి కాళ్లమీద 50వేలు పోసేసి పొయ్యేలా చెయ్యడం.

మీరు నమ్మితే ఎంత, నమ్మకపోతే ఎంత - ఇంకొక రోజు నాభార్య చంద్రమండలానికే నిచ్చెనేసేసింది. దీప్తి చదివే స్కూల్లో - సైడ్ బిజినెస్‌గా ఐఐటి ఫౌండేషన్ కోచింగ్ పెట్టుకున్నారు కూతురొచ్చి ఈ విషయం అమ్మకు చెప్పడం, అమ్మ వెయ్యి రూపాయలు ఎత్తుకుపోయి స్కూల్లో ఫీజు కట్టేసి కూతుర్ని ఐఐటి కోచింగ్‌లో చేర్పించడం టకటకా జరిగిపోయినాయి

ఒకరోజు దీప్తి పొరబాటున ఇంట్లో, "అమ్మా, మాకు ఐఐటి కోచింగ్‌లో 9th లోనే టెన్త్ సిలబస్సు, టెన్త్‌లోనే ఇంటర్ సిలబస్సు చెప్పేస్తారంట " అని చెప్పింది.

ఇది దాన్ని పట్టుకునింది గట్టిగా. ఇంకేం? దీప్తికి ఐఐటిలో సీటురాకపోయినా ఎంసెట్‌లో ర్యాంకు రాకుండా పోతుందా! అనే గట్టి అభిప్రాయానికొచ్చేసింది.

ఎంసెట్‌లో ర్యాంకు అంటే ఏదో 5వేలో ర్యాంకో, వెయ్యిలోపల ర్యాంకో అనుకునేరు! ఎంసెట్‌లో ఫస్ట్ లేదా సెకండ్ లేదా థర్డ్ అట్‌లీస్ట్ బిలో టెన్!

ఎందుకంటే దీప్తి ఎట్లాగూ క్లవరు పైగా ఐఐటీ కోచింగ్ ఇప్పిస్తున్నాం నైన్త్‌లోనే టెన్త్ అయిపోతుంది. టెన్త్‌లో ఇంటర్ అయిపోతుంది ఇంటర్‌లో స్పీడ్ అయిపోయి రేయింబవళ్లూ ఎంసెట్ మీదే కష్టపడుతుంది. ఎందుకు రాదు!

మరిది కొడుక్కి టెన్త్‌లో 570 వొచ్చినాయంట. వొక కాలేజీ వాళ్లు వచ్చి 'కారెక్కేసెయ్, గుడ్డా గుసురు కూడా మాదే. ఇంజనీరు కావాలంటే ఇంజనీరూ, డాక్టరు కావాలంటే డాక్టరూ చేసి పంపిస్తాం.' అని కుయ్యోమొర్రో అన్నారంట అయినా ఆమె మరిది వాళ్లు తొందర పళ్లేదంట. ఆ మరసట్రోజే ఇంకో కాలేజీవోళ్లొచ్చి 20వేలు కూడా ఇస్తామన్నారంట అప్పుడు మాత్రం ఆమె మరిది వాళ్ళు, 'రేపు మంచిరోజు. రేపు రండి. పిల్లోణ్ణి మీతోపాటు కారెక్కిస్తాం" అన్నారంట. ఆ కాలేజీ వాళ్లు రేపు వస్తే ఏముందీ? 50వేలు కమలమ్మ మరిది కాళ్ళమీద పోసేసి నెల్లూరు నుంచి పెద్ద కాలేజీవాళ్ళు పిల్లాణ్ణి కారెక్కించుకోని ఆపాటికే ఎగరేసుకుపొయ్యుంటే ...

"ఏం వాడికేమైనా కొమ్ములొచ్చినాయా? నీకుమాత్రం ఎందుకు రావు 570 పట్టుదల వుండాలే గానీ-" అని కూర్చునిందీమె

ఈ కథ జరిగిన రోజుటికి నా కూతురి మీద వున్న బరువూ బాధ్యతా టెన్త్‌లో 570 సంపాయించడం, ప్రైవేటు కాలేజీ వాళ్లు మా చుట్టూ తిరిగి కాళ్లమీద 50వేలు పోసేసి పొయ్యేలా చెయ్యడం.

మీరు నమ్మితే ఎంత, నమ్మకపోతే ఎంత - ఇంకొక రోజు నాభార్య చంద్రమండలానికే నిచ్చెనేసేసింది. దీప్తి చదివే స్కూల్లో - సైడ్ బిజినెస్‌గా ఐఐటి ఫౌండేషన్ కోచింగ్ పెట్టుకున్నారు కూతురొచ్చి ఈ విషయం అమ్మకు చెప్పడం, అమ్మ వెయ్యి రూపాయలు ఎత్తుకుపోయి స్కూల్లో ఫీజు కట్టేసి కూతుర్ని ఐఐటి కోచింగ్‌లో చేర్పించడం టకటకా జరిగిపోయినాయి

ఒకరోజు దీప్తి పొరబాటున ఇంట్లో, "అమ్మా, మాకు ఐఐటి కోచింగ్‌లో 9th లోనే టెన్త్ సిలబస్సు, టెన్త్‌లోనే ఇంటర్ సిలబస్సు చెప్పేస్తారంట " అని చెప్పింది.

ఇది దాన్ని పట్టుకునింది గట్టిగా. ఇంకేం? దీప్తికి ఐఐటిలో సీటురాక పోయినా ఎంసెట్‌లో ర్యాంకు రాకుండా పోతుందా! అనే గట్టి అభిప్రాయానికొచ్చేసింది.

ఎంసెట్‌లో ర్యాంకు అంటే ఏదో 5వేలో ర్యాంకో, వెయ్యిలోపల ర్యాంకో అనుకునేరు! ఎంసెట్‌లో ఫస్ట్ లేదా సెకండ్ లేదా థర్డ్ అట్‌లీస్ట్ బిలో టెన్!

ఎందుకంటే దీప్తి ఎట్లాగూ క్లవరు పైగా ఐఐటీ కోచింగ్ ఇప్పిస్తున్నాం నైన్త్‌లోనే టెన్త్ అయిపోతుంది. టెన్త్‌లో ఇంటర్ అయిపోతుంది ఇంటర్‌లో స్పీడ్ అయిపోయి రేయింబవళ్లూ ఎంసెట్ మీదే కష్టపడుతుంది. ఎందుకు రాదు!